దస్సియు: - రమ్యాకృతిమైన దాని. అర. ౨. ౧౧౫.

దయ్యగు: ఏమి కొఱంత యయ్యెనిట్లు -. స. ౨. ౧౦౨.

దయ్యఁగన్: - ఁబోరి. ని. ४. ౯౮.

డాఁగు:

డాఁగి: పొదలలోన -. అర. ౨. ౮౨.

డాఁచు:

డాఁచి: కృతవర్మ్య ధనమెల్లఁ గ్షప్తి చేసికొని - యున్నవారని. ఆది. ౭. ౧౩౩.

డాయు:

డాయక: ఒకస్థానంబు -. ఆది. ౬. ౨౯౨.

డాయన్: పాండవుల్ చనిరి ద్రోణాచార్యు -. ఆది. ౯. ౨౯.

డాయను: అగ్నిశిఖయుఁబోలె నంటను -. అర. ౨. ౯౧.

డాయరు:

డాసి: ఆ జరాసంధు -. స. ౧. ౧౩౨.

డాసిన: - మృగముల నెగసి. ఆది. ४. ౧౩.

డాసినన్: చేసమరికొంచుఁ పొడువగ -. ఆది. ౬. ౨౦౬.

డించు:

డించి:

డిందు:

డిందుచున్: మాంసమెల్లఁ పెట్టినను కపోతభాగము కడిందిగ - నుండె నత్తులన్. అర. ౩. ౨౩౫.

డిగు :

డిగన్: కంఠబిలము క్రిందికి - (చనక). అది. ౨. ౬౧.

డిగన్: - ద్రావి. ని. ౫. ౯.

డిగ్గు :

డిగ్గి: ఆసనములు —. అర. ౨. ౩౯.

డిగ్గన్: - ద్రావి. ని. ౪. ౮౪.

డొల్లు:

డొల్లఁగన్: నిష్ఠుర దీర్ఘదండమున - వ్రేయుచు. ఆది. ౧. ౧౫౩.

డొల్లన్: ని. ౫. ౮౪.

తక్కు :

తక్కన్: పితరుల ఋణంబు - తక్కిన మూడు ఋణంబుల వలన విముక్తుండ నయితి. ఆది. ౫. ౭౦.

తక్కవు: ఆదినిసంయోగ వియోగాది ద్వంద్వములు దేహియగు వానికి సంపాదిలక —. ఆది. ౬. ౨౪౯.

తక్కి: ఒక్కమూలంబ - యున్నదాని. ఆది. ౨. ౧౪౧; ౧౪౪. పితరుల ఋణము దేహనాశమయినను తీఱదు నాకు అదియు — యున్నది. ఆది. ౫. ౭౧.

తక్కిన: ఒక్క భాగంబు భీమునకున్ పెట్టి — భాగంబు. ఆది. ౬. ౨౪౧.

తక్కున్: పర్వతములు వజ్రపాతహతిని బోక — నేని నింద్రతనయు దివ్యనిశిత బాణతతుల నిశ్శేషమగునన. అర. ౧. ౧౮౧.

తక్కుదురు: మ. ని. ౪. ౭౪.

తక్కొను :

తక్కొనన్ : పంచభూతంబులు...రాత్రియు నన్మహాపదార్థము నివి యుండఁగానరుఁడు — నేర్చునె తన్ను గ్రుచ్చిలన్. ఆది. ౪.౮౦.

తగు :

తగక : రాజ్యంబునకుఁ - కున్న. ఆది. ౬. ౧౨౪.

తగన్ : — మృతసంజీవని లేమిఁజేసి యమసాదనమున కరుగుదురు శీర్వాదర్పితు లయ్యున్. ఆది. ౩. ౧౦౪.

తగఁడు : రాజవరుఁడైన పార్థుతో రాజుగాని యీతఁడని చేయగా-డేని వీని నెల్లవారును చూడంగ ఈక్షణము రాజుఁచేసెద నేనంగ రాజ్య మిచ్చి. ఆది. ౬. ౪౮.

తగదు : క్రోధంబు కొనియాడన్ —. ఆది. ౩. ౧౪౮.

తగని : — దండము దండింపఁగ బ్రాహ్మణుండఁ తగు నన్నున్. ఆది. ౪. ౨౬౯.

తగరు : వీరు నమ్మఁ —. ఆది. ౬. ౧౧౦.

తగవు :

తగి : నాలవ పర్వము నాఁ —. ఆది. ౧. ౪౨.

తగిన : నీబలంబునకుఁ — యిధ్మభారంబమోచికొని. ఆది. ౨.౮౫.

• తగియెడు : — పుత్త్రులన్ పడసి. ఆది. ౨. ౧౫౦.

తగు : యథావిధి సంస్కరింపం — వారలన్ పంచుటయు. ఆది. ౧. ౫౫.

తగుచున్ : నాభుజవీర్యవిక్రమ గుణంబులకున్ — చున్న ధనుర్లాభము. సు. ౧. ౧౨౮.

తగుదురు : వీరు నమ్మంగ —. ఆది. ౬. ౧౧౦.

తగున్ : — నిది తగదని ఎదలో వగవక. ఆది. ౧. ౮౬.

తగునయ్యు : ఉత్తమావమానము — చేయను. ఆది. 3. ౨౧౭.

తవు :

తవిన : కవిలకన్నులును — యున్నవ నల్లనైన దీర్ఘపుం దనువును చూచి. ఆది. ౪. ౨౫౪.

తగులు : వెంబడించు.

తగిలి : ఉదంకుడును వానితోడన — అవ్వివరంబునకును రగలోకం బున కరిగి. ఆది. ౧. ౧౦౪; మృగయావ్యసనంబునం — ఆది. ౫. ౪౬.

తగిలెడు : నెగసి పిఱుందన్ - మిడుఁగుఱులచేత దగ్ధచ్ఛదమై గగనమున వఱవనోపక ఖగనివహము వహ్నియంద కడువడిఁ పడియెన్. ఆది. ౮. ౨౬౪.

తగిలెన్ : ఇది మునికన్యయేని మఱి యేలొకొ యీలలితాంగి యందు నా హృదయము తద్ధయున్ - ? ఆది. ౪. 30.

తగిలిన : నిద్ర - నదియు. ఆర. ౨. ౭౭. నా హృదయము తద్ధయున్ - యది. ఆర. 3. ౧౦౬.

తగుల్చు :

తగిల్చి : (తగులవైచి). ఆది. ౨. ౧౬౮.

తగులదు : ముందర దారపరిగ్రహము చేయ - బుద్ధిన్. అది. ౨. ౧౪౭. నందు చిత్తమున్ - నాకు నెన్నఁడును. ఆది. ౭. ౧౫౨.

తగులన్ : అపగతప్రాణంబై పడియున్న పామున్ తన వింటికొప్పున నెత్తి, అమ్ముని యఱుతన్ - వైచి. ఆది. ౨. ౧౬౮.

తగులు :

తగులుచున్ : మకరందరసమున్ -. ఆది. ౫. ౧౩౯.

తగులున్ : మనోముదంబుఁ - ఁగాక! ఆది. ౮. ౨౫.

తగులున్ : ధృతిహీనుల చిత్తము లట్లతివల యందేల - నత్యంత దృఢవ్రతుల మనంబులు. ఆది. ౮. ౧౫౭.

తవులు :

తవిలి : భారత వాగమృతంబు కర్ణరంధ్రమ్మను నంజలిన్ - త్రావుదురు. ఆది. ౧. ౭౭.

తడఁబడు :

తడఁబడన్ : -. నేసియు వైచియు. ఆది. ౨. ౯౫; - ఁబడిమెడు రవమును. ఆది. ౨. ౨౧౬.

తడఁబడి : పండ్లు - వారలతో ధరణి మీఁదఁ దొరఁగుచుండ. ఆది. ౫.౧౬౬.

తడయు :

తడయక : - మ్రొక్కియున్న వినతాసుతు నప్పుడు చూచి. ఆది. ౨. ౮౩.

తడయుచున్ :

తడసెన్ : దానన వర్షము - భవద్దేశమునకు. అర. ౩. ౯౨.

తడియు :

తడియన్ : కట్టిన పుట్టంబు - దొప్పి. స. ౨. ౮౬.

తడిసిన : - ఏకవస్త్ర పరిధానముతోడ. స. ౨. ౩౦౮.

తడుపు :

తడుపుచున్ : శీతజలంబులం - నుండునది. ఆది. ౫. ౧౦౧. శోక తప్తంబైన తన హృదయంబు - చున్నది యునుం బోలె. ఆర. ౨. ౨౦౯.

తడిపెన్ : శిరముఁ - వెండియు హర్షాశ్రుశతులఁ జేసి. ఆది. ౬. ౫౪

తనరు :

తనరన్ : జనకుండు-. ఆది. ౪'.౪౯; - జూదం బాడి. స. ౨. ౨౦౭.

తనరి : తమతమ చిహ్నముల్ - మెఱుక పడఁగ. ఆది. ౭. ౧౬౬.

తనరిన : పెద్దయు జెడగై - యలంబ తీర్థమున కరిగె. ఆది. ౨.౭౧.

తనరిరి : - తద్దేశంబున ననవరతేము యజన యాజనా ధ్యయనా ధ్యాపన దానములుఁ బ్రతిగ్రహమునను షట్కర్మములను భూసుర వంశ్యుల్. ఆది. ౮. ౮౪.

తనర్చి : ఏచి - తలిచిన క్రోవ్వుల నిమ్మఁగు తావుల. ఆది. ౪. ౨౦.

తనరుచున్ : కడలేని మెఱుసఁ - న్న. ఆది. ౩.౧౨; - దైవయుక్తి మెయి. ఆది. ౮ .౩౬.

తనరున్ : - విష్ణుభట్టారకుదయ నభీష్టసిద్ధి ననియె. ఆది. ౮.౧౬౪.

తనరుమ : లోకోత్తర తేజోధర్మయుక్తిఁ - యనుచున్. స. ౧.౮౬

తనరెడి : రాజ్యలీల - వానిన్. ఆర ౨.౧౦౧.

తనరెడు : శయన క్రియలన్ - వా రేకస్త్రీ వినిహిత కాములై రఘుడు విధినియమమునన్. ఆది. ౮.౧౦౭.

తనియు

తనియక : అది కామభోగంబులన్ -. ఆది. ౭. ౨౫౯.

తనియఁగన్ : అనవరతము బ్రాహ్మణులకుఁ - ధనమిచ్చు జామదగ్న్యుఁడు రాముండు. ఆది. ౫. ౧౯౭.

తనిసి : ప్రతీపుఁ డఖిల క్ష్మారాజ్య సుఖములఁ-. ఆది. ౪. ౧33
తనిసిన :

తవిపి : ఇంద్రాది దేవతలన్ -. ఆది. ౪. ౧౨౨.

తనిపెన్ : ఖాండవ దహనంబున అగ్ని దేవున్ -. (పి) ఆది. 3. ౧౭
ఘనభుజు నభీష్టపూజా ధనదాన విధానముల ముదంబునఁ -.
ఆది. ౫. ౨౨౦.

తనుపు : - (తనువు) సౌరభము నొంది. ఆది. ౫. ౧3౯.
తనుపుచున్ : పితృ దేవతలన్ -. ఆది. 3. ౨౦౧.

తనుపున్ :

తనుపుము : కామోప భోగంబులన్ - మనిన. ఆది ౭. ౨౫౯.

తన్పు :

తన్పి : ధనార్థుల -. స. ౧. ౧౭.
తన్పుచున్ : సమంచిత దక్షిణలిచ్చి -. ఆది. ౧. ౯౦.
తన్పుదున్ : పూజలఁ -. ఆది. ౧. ౧3౯.
తనిపిన : తద్పృపాహవ్యంబుల హవ్యవహునిన్-న్. ఆర. 3. ౨౧౪.

తనుకు :

తనుకక : కరమొప్పుచున్న చెఱువులు ధరణి కవగ్రహ భయంబు-
• యుండన్. స. ౧. ౪3.
తనుకఁగన్ : విషవహ్నులు - ఁగురుపీరుఁ కఱచి తక్షకుఁడరిగెన్.
ఆది. ౨. ౨౦౦.
తనుకుచున్ : - నున్న నీహృదయ తాప నిమిత్తమునన్ సురేంద్ర
నందను పటుబాణహత హతిఁ తద్ధృతరాష్ట్ర బలంబు మృత్యు
సదనమున కేఁగుఁజుమ్ము. ఆర. ౧. ౧౪౧.

తన్ను :

దుష్టచిత్తుఁడైన కష్టు దుర్యోధను శిరము - వాఁడ. స. ౨. ౨౯౬.

తప్పు :

తప్పక : ధర్మువు - కుండఁపడసిరి పలువురఁ గొడుకుల. ఆది. ౩. ౫౧.

తప్పదు : ఇది - పాండవులు పరలోక గతులుకారు. ఆది. ౮. ౨౫.

తప్పంగన్ : నిన్నుఁ పాండుతనయుల్ - పూజించిరి. స. ౨. ౬౩

తప్పన్ : ఇట్టి కులవిస్తారకు దార మను దారధర్మ ప్రియా నిష్కారణమ - చూడఁగ సారమతీ! చనునె? ఆది. ౪. ౯౩.

తప్పని : నధర్మువు - వారికి. అర. ౧. ౩౮౯.

తప్పి : ధర్మువు నుచితంబుఁ - వినతకా వైనతేయున కుపకారము చేసిరిప్పుడు. ఆది. ౨. ౧౨౬.

తప్పింపన్ : దైవకృతం బెవ్వరికిఁ - నశక్యంబు. అర. ౩. ౨౦౩.

తప్పినన్ : ధర్మతనూజుండు ధర్మువు - ధరణీతలం బెల్లఁ తల్లడిల్లు. స. ౨. ౨౨౪.

తప్పినను : సాక్షియును ధర్మదర్శియు, సాక్ష్య విదులుఁ తప్పఁగాదు; - నధర్మయుక్తి వరుణపాశ సహస్రంబు వానిఁగట్టి పాయునేఁ డేఁటేట నొక్కొక్కఁ డాయతబగ. స. ౨. ౨౪౨.

తప్పున్ : ఇంతుల గోష్ఠినున్న యతఁడెంత వివేకము కల్గెనేని అత్యంత మభిభూతుఁడగు; ధర్మువు -. ఆది. ౮. ౫౯.

తప్పుదున్ : నేనేల ధర్మువు -. అర. ౧. ౨౨౭.

తప్పెన్ : ఖాండవ ప్రళయంబునకున్ -. ఆది. ౭. ౨౭౭.

తప్పితి : నన్నుఁ ప్రదక్షిణంబు నిత్యమ్మును జేయకేల మతి - మేరువుఁ గొల్వనేటికిన్. అర. ౩. ౨౧.

తప్పితిమి : వారల విడిచిపుచ్చి కర్జంబు -. స. ౨. ౨౭౨.

తప్పిన : ఇట్లు చేయనైతినేని పితృపితామహుల గతికిన్ - వాఁడ నగుదు ననిన. స. ౨. ౨౩౪.

తఱియు :

తఱియన్ : రాజమార్గంబు - వచ్చి. ఆది. ౫. ౧౫౨.

తఱియంగన్ : దుర్గమర్థజల గౌరవ భారత భారతీ సముద్రముఁ - నీదను విధాతృనకైనను నేరఁబోలునే? ఆది. ౧. ౧౯,

తఱుఁగు :

తఱుఁగక : వారలకు నెమ్మి యుండఁడన్. స. ౧. ౪౦.

తఱుఁగంగన్ : ధర్మకామంబులు - నర్థార్థి యగువాఁడు పతితుఁడౌ నర్థసేవఁ. అర. ౧. ౨౪౫.

తఱిఁగి : అనల వరుణ పవన ధనద యమాసురుల్ వీఁక - కాంది శీకులయిరి. ఆది. ౨. ౧౦౦.

తఱిఁగినన్ : దివ్య బాణంబుల శక్తి -. ఆది. ౧. ౬౫.

తఱిఁగెన్ :

తఱుగున్ : అర్ఘువుల్ - నందురు. ఆది. ౪. ౨౫౦.

తఱుఁగు : నిదాహదాహంబున నింకి - అల్పజలాశయంబునుంబోలె. స. ౨. ౮౮.

తఱిఁగినన్ : తనపట్టిన సురియ న ప్పెనుబాము వదనంబు ప్రయ్యన్-. అర. ౨. ౮౯.

తరఁచు :

తరుగన్ : వార్థినిట్లు - విషముద్భవిల్లి. ఆది. ౨. ౧౫.

తలఁకు :

తలఁకక :

తలంకి : ధృతరాష్ట్రనందనుల్ ధృతి - నిద్రలేక, ఆది. ౬. ౨౮౧.

తలఁగు :

తలఁగక :

తలఁగన్ : దానిన్ తనపాదంబునంజేసి - ద్రోచిన. ఆర. 3. ౨౬.

తలఁగు :

తలఁగుము : తడయక నీవిపుడు దీనిఁ - కడకన్. ఆర. 3. ౬౮,

తలుఁగు :

తప్పించు.

తలింగి : ఈ బ్రాహ్మణు నాపదన్ - నాకు మనఃప్రియంబు చేయుము. ఆది. ౬. ౨౭౮.

తలిఁగితి :

తలిఁగెదు : విప్రులు మహాపురుషుల్ పరుషాపరాధముల్ - వారు. ఆది. ౮. ౧౫౯.

తలుఁగక :

తలుఁగన్ : దేహిత్రలాభంబు - నెట్లు దీనిఁ పుత్త్రు. ఆది. ౬. ౨౫౧

తలుఁగుదున్ : ఇచ్చనుపతోఁ చని, ఇవ్వనక్లేశంబు - నని. ఆర. ౨. ౧౧౪.

తలుఁగుము :

తలుఁగంగన్ : ఉత్తమ క్షత్త్రియుం డోరుల దుఃఖంబులుఁ - పుట్టినపథ శీలుఁడు. ఆది. ౬. ౨౮౬.

తలంచు :

తలంచి: పాండవ ధార్తరాష్ట్రులకు సంధి కావింపన్ -. ఆది. ౧.౪3; అప్పాండుం -. ఆది. ౬. ౧3౪.

తలంచితివి: నీవు నాకవమానంబు -. ఆది. ౨. ౧౬౧.

తలంచిన: ఇట్లు - పండ్రెండగు దివసంబునకు వచ్చి. ఆది. ౭.౮౪.

తలంచు: వారల కపాయము డెందములన్ - మూర్ఖులకు. ఆది. ౮. ౧౫౯.

తలంచుచున్: ప్రచేతను పుత్త్రుభక్తిం -. ఆది. ౧. ౨౧.

తలంచుడున్: పరాశరు - నాకుణంబ. ఆది. ౪. ౨౫౮; గరుడుం నిన్ - త్రత్త్రణంబ. స. ౧. ౨౧౬.

తలంచునది: మీకున్ పనిగల యప్పుడ నన్నున్ -. అర. 3. ౪౬.

తలంచితిన్: ఎంతయు భక్తిం ఇనుం -. ఆది. ౫. ౨౮.

తలంచెన్: భామిని కృష్ణుం - భీతయై. స. ౨. ౨౧౯.

తలంతురు: వారలిట - రొక్కొ? అర. ౧. ౯౬.

తలంతువు: (తలంచితి) నీ వెన్నండేనియు నవమానంబు - నాడ నిన్నున్ పాసిపోపుదు. ఆది. ౨. ౧౫౫.

తలంపక: నన్ను అనురక్త నన్వ్రవతున్ -. అర. ౨. ౨౧౧.

తలంపడు: - డ. ఆది. ౨. ౧౨౯. నీసుతులుచేసిన యెగ్గు -. అర. ౧. ౫౧.

తలంపఁబడియెడు: వీనిచేతం - వనిత. అర. ౨. ౧3౬.

తలంపకుండు: నొవ్వగమెండు -. ఆది. ౮. ౫౯.

తలంపన్ :

తలంపుము: నన్ను - మనిన. ఆది. ౫. ౮౪.

తలంపుండు: ఇది పథ్యముకాంగం -. డాత్మలోన్. ఆది. ౬. ౧3౪.

తలఁచి: బాలుఁడని - రిపుతో ఏ విధమున కలసియునిక ఎంతయు వలదు. ఆది. ౬. ౧౧౭.

తలఁచిన: అతని (కర్ణుని) బాహు విక్రమమును - నాఁడు కన్ను మూయదు నాకున్. ఆర. ౧. ౨౭౦.

తలఁచిరి: కృపుఁడు నుదారుఁడు విదురుండు నేమి. - రో బుద్ధిన్? ఆర. ౧. ౪.

తలఁచుచున్: గరుడధ్వజు...భక్తిఁ - నుండెన్. ఆది. ౮.౧౬౬.

తలఁచున్: కౌరవుఁడేమని - నొక్కో? ఆర. ౧. ౨౩౮.

తలఁతురు: మనలఁ గౌరవులు పరాక్రమ హీనులుగా -. ఆర. ౧. ౨౪౩.

తలఁతున్: నామెదలోనఁ - నీయభిప్రాయంబ. ఆది. ౬. ౧౩౦

తలఁచెన్: హరి యింద్రుఁ -. ఆది. ౮. ౬౯.

తలిర్చు: - ర్చిన ఏచి తనర్చి - త్రోవుల నిమ్మగు తావుల జొంపములన్. ఆది. ౪. ౨౦.

తలఁపక: ఉరగకళేబర మంసాంతరమునఁదడి వ్రేలచునికి - అచల స్థిరుండై. ఆది. ౨. ౧౭౨.

తలఁపకుఁడు: మీకన్నియు చేయఁగ నవునని -. ఆది. ౨. ౧౩౩.

తలఁపఁగన్: - నాఁడు పల్కిన విధంబెడఁ తప్పఁగ వీడె నొక్కొ? ఆది. ౪. ౭౦.

తలఁపకుఁడు: ఈనటరాజును - డసుర నోర్వబలిమి లేమి. ఆది. ౬. ౨౬౯.

తలఁపన్: అంతఃకరణంబులఁ - ఁపొందగా నోపుదుమే? ఆది. ౫. ౭౬.

తలఁపను: నీ కిట్లని పల్కను - నగునె?. ఆది. ౬. ౫౯.

తలఁపవు: దీనిన్ - వెట్టు? ఆది. ౭. ౧౧౨.

తలఁకింపఁగన్: మఱచినఁ - నగు. ఆది. ౪. ౭౨.

తలఁపుఁడు:

తలఁపుము: ధర్మ వెఱఁగి దానిఁ - మిపుడు. ఆది. ౪. ౨౧౩.

తలఁచునది: నన్ను రణాంతరమున - ఓ. ఆర. ౩. ౩౫౪.

తలకొనుదెంచు:

తలకొనుదెంచెన్: తలయేరును, ఉక్కిసయును -. ఆది. ౩. ౧౯౧.

తలరు:

తలరక: -మును సౌగంధికములు గొని. ఆర. ౪. ౨౫. - వయుచుఁ పినాకి తాఁకెఁ గిరీటిన్. ఆర. ౧. ౩౦౯. ధ్వజినీ పాత భరంబునన్ - (గా) ధాత్రీధరాహీంద్రమూర్ధజ రత్నప్రకరంబులు. ఆది. ౫. ౩౬.

తలఁగఁగన్: - రేణు...రక్షులఁకులిశ నిశాత నఖావలిఁ పక్షీంద్రుండు వచ్చి వందఱలాడెన్. ఆది. ౨. ౧౦౧.

తలరన్: అమితవాహినీ - పదాహతి ధరిత్రి - నిట్టు లగిగి. స. ౧. ౨౪౫.

తలరి: జ్వాలనశిఖాలియున్ విజయు సద్విశిఖాలియుఁచుట్టు ముట్టినన్ - భయాకులంబులగు తద్వనజీవుల యార్తనాదము. ఆది. ౮. ౨౬౩; నలుఁడును ధరణీరాజ్యము తలఁగఁగ, సర్వంబు నపహృతం బైనన్ కడున్ - దమయంతిఁ తోడ్కొని వెడల వడిమె అశేషరాజ్య విభవచ్యుతుఁడై. ఆర. ౨. ౬౫.

తల్లడిల్లు :

తల్లడిల్లన్ : శత్రువరుల నెల్ల - నెగిచిన యతండు భీమసేనుఁడమిత భీమబలుఁడు. ఆది. ౮ ౧౦.

తల్లడిల్లి : భయముతగిలి మత్తైన్యంబు - ఉలిసెఁ పెల్లురేఁగి. ఆర. ౧. ౧౯౧.

తల్లడిల్లున్ : ధరణీ తలంబెల్లఁ -. స. ౨. ౨౨౪.

తల్లడిల్లుచున్ : అమిత వాహినీ పదహతిఁ - చుండ ధరణి తలము. స. ౧. ౨౬౮.

తల్లడిల్లెన్ : ని. ౪. ౬౧.

తవులు :

తవిలి : భారతవాగమృతంబు కర్ణరంధ్రమ్మను నంజలిన్ - త్రావు దురు. ఆది. ౧. 22; అధికచింతఁ - యున్న నయ్యుదంకు నభిప్రాయ మెఱిఁగి. ఆది. ౧. ౧౧౫.

తాఁకు :

తాఁకక : భీమశిఖావళి - కుండఁగన్. ఆది. ౮. 3౦౫.

తాఁకన్ : ఆయుధంబులు - ఓడునట్టివాడని వనజఁబులు కలిగిన ఇంద్రమాల. ఆది. 3. ౨౪; ఒక్క ఖగమా ఖగమున్ వ్యోమమున - దివి సంగ్రామంబా రెంటికయ్యెఁ కడు రభసము నన్. ఆది. 3. ౨౯.

తాఁకి ; అమరవరులఁ - యేసిరి. ఆది. ౨. ౨౧; ౮. ౧౯౪.

తాఁకిన : అని మొనసట్లు - మహారథులన్. ఆది. ౮. ౧౧.

తాఁకిరి : దైత్యోత్తములన్ .. నరనారాయణుల్ - రఁకన్, ఆది. ౨. ౨౨; ౯౪.

తాఁకు : మధ్యము మహోగ్ర శరంబులు - కోర్వక. అర. ౪. ౧౨.
తాఁకుదెంచెన్ : తరువుఁ బెఱికి కొనుచుఁ -. ఆది. ౬. ౨౯౫.
తాఁకెన్ : పూరుకులోత్తముఁ - వీఁకతోన్. ఆది. ౪. ౨౦౫.
శల్యుఁడనిలనందనుఁ -. ఆది. ౭. ౧౯౭.
తాఁకెను : కర్ణుఁడు నరుఁ -. ఆది ౭. ౧౯౭.

తాఁచు :

తాఁచి ; పొడిచియుఁ - యు. స. ౧. ౨౦౭.
తాఁచెన్ : వృకోదరుండసురన్ (బకుని) పడఁగనడిన్ వైచి, వామ పాదంబునఁ జేడ్పడ వాని ద్రొమ్ముఁ -. ఆది. ౬. ౩౦౨.

తాల్చు :

తాల్చి : మహీంభరమజస్ర సహస్ర ఫణాళిఁ -. ఆది. ౧. ౧౦౫.
తాల్చితిని : ధృతిఁపూని బ్రహ్మచర్యవ్రతమున్న తిఁ -. ఆది. ౪.౧౯.
తాల్చితిరి : ఏమికారణమున ఉగ్రగ్రాహ రూపములు - రిరు. ఆది. ౮. ౧౫౪.
తాల్చిన : అవని రాజ్యభరంబు - యుతనుండి. ఆది. ౨. ౨౨౫.
తాల్చినన్ : ఎద్దానినేని -. ఆది ౩. ౨౪; ధర్మజుఁ డిప్పుడు -. ఆది. ౬. ౧౨౮.
తాల్చు : పెంపున్ గర్వమున్ - వాఁడు. ఆది. ౭. ౫౦.
తాల్చున్ : ఆతని తనయుండు మఱి దాని - మీఁద. ఆది. ౬. ౧౨౮.
తాల్చెన్ : వసుధా రాజ్యంబు భీష్మవచనమున గతవ్యసనుఁడయి - తేజంబెసగంగ చిత్రవీర్యుఁడిద్ధయశుండై. ఆది. ౪. ౧౯౭.
తాల్చెదన్ : మ. ని. ౫. ౧౮

తాల్చుచున్ ; భూవలయంబునెల్ల నాలావునఁ బూని -. ఆది. ౨. ౧౧౫
తాల్పిన్ : అఖిలంబు- నోపునట్టి ధైర్యయుతుఁడవు. ఆది. ౨. ౧౨౬.

తిగుచు :

తిగిచి : తెరవలలువైచి జాలరుల్ -. ఆది. 3. 3౨; చాపంబు లాకర్ణాంతంబులుగా వడిన్ -. ఆది. ౭ ౧౯౮.
తిగిచికొని : దానిన్ - యిచ్చినన్. ఆది. ౫. ౨౧౧; ధర్మనందనుం డాతనిన్ తనపైకిన్ - మూర్ధాఘ్రాణంబుచేసి. అర. ౧. 3౯౫.
తిగిచెన్ : నూతిలో వెలువడఁ గోమలిన్ -. ఆది. 3. ౧౪౪.

తివియు :

తివియన్ : బలహీనుఁడైన వానికి అలవియె మోపెట్టి -. ఆది. ౭. ౨3౪.
తివ్వను : ఎవ్వరికి మోపెట్టను - శక్యంబుగాని దృఢకార్ముకముల్. ఆది. ౭. ౨౬.

తిట్టు :

తిట్టినన్ : అడిచినఁ -. ఆది. ౧. ౧3౯.
తిట్టుచున్ ; మునులన్ -. అర. 3. ౧౫౨.

తిను :

తించును :

తినక :

తినుచున్ : ఎదురఁబడినఁ దాఁకి, వదలక శార్దూల శరభ సామజాది సత్త్వతతులఁబట్టి - నున్న యట్టి నాకిప్పుడు భక్ష్యమైతి వీవు పాండుపుత్త్ర ! అర. ౪. ౧౧౦.

**తిరుగు :**

తిరుగక :

తిరిగి : మర్త్యలోకంబునకు - వచ్చి. ఆది. ౮. ౩౦౦.

తిరిగెడు : దివమున - నవ్విలసన్మకనక మత్స్యయంత్రము చేసెన్. ఆది. ౭. ౧౬.

తిరిగెన్ : ధరిత్రి దిర్దిరఁ -. స ౨. ౭౦.

తిరుగంగన్ : అతిరోష లోహితాయత వృత్త నేత్రముల్ - బెట్టుచు. ఆది. ౬. ౨౦౨.

తిరుగుచున్ : - పుట్టలన్ పొదలఁ ద్రిమ్మరు పాముల రోసి రోసి. ఆది. ౧. ౧౫౩.

తిరుగున్ : మూఁడులోకమ్ములు దిర్దిరన్ -. ఆది. ౪. ౩౮.

తిరుగు : భీషణారణ్యంబున - నది ముందటి. అర. ౨. ౯౬.

**తివురు :**

తివిరి : మఖంబులన్ - యిష్టధనంబు లిచ్చుటఁ దృప్తులైరి మహాద్విజుల్. ఆది. ౨. ౨౨౫.

తివిరెన్ : దానిఁ కవయన్ -. ఆది. ౪. ౪౫.

తివురు : చదలఁ - దేవదుందుభి నాదంబు. ఆది. ౭. ౨౮౭.

తివురున్ : వేడ్కతో మఱుమాట వినఁగ -. ఆది. ౩. ౩౮.

**తీరు :**

తీరన్ : తనప్రతిజ్ఞ - (అ). ఆది. ౧. ౫౩.

**తీర్చు :**

తీర్చి : దేవకార్యంబు -. అర. ౨. ౨౯౭.

తీర్చితి : ఇష్టంబు -. ఆది. ౫. ౧౪౫.

తీర్చెదన్ : ఏను – నని పూనె నింద్రసుతుఁడు. ఆది. ౫. ౨౨౪.

తీర్తున్ : మ. ని. ౫. ౭.

తీర్పక : విప్రులకయినబాధ – ఉపేక్షించు పాతకంబని. ఆది. ౮. ౧౧౬.

తీర్పన్ : – రాదనృతాభిభాషణమునన్నైన పాపభయము. ఆది. ౧. ౧౩౦; భీతియిష్టంబు –. ఆది. ౫. ౧౪౫; తన యిష్టంబు – పూనిన యర్జును. ఆది. ౫. ౨౨౫.

తీర్పని : పాపముపొందు ధర్మ సందేహము – నాఁడు సభ్యులగు సజ్జనులన్. స. ౨. ౨౩౫.

తీర్చుకొనఁగన్ : శాపభయము – ఁబోలు. ఆది. ౧. ౧౩౦.

తీర్చుకొనన్ :

తీర్చుకొని : వగ–. ని. ౫. ౮౧.

తీర్చు : మావాద మెఱిఁగి – గుణశ్రేష్ఠుఁ డితఁడో నేమి. స. ౨. ౨౪౦.

తీర్పన్ : కాలవశంబ ఎవ్వరికిన్ – ఁతరంబుగాదు. ఆది. ౧.౧౫౧.

తీఱు :

తీఱన్ : తనప్రతిజ్ఞ –. ఆది. ౧. ౫౩.

తీఱదు : పితరుల ఋణము దేహనాశమయినను –. ఆది. ౫. ౭౧.

తీఱున్ : దేహనాశంబుతోడన – నెల్ల ఋణములును. ఆది. ౫. ౭౧.

తీఱఁగన్ : పరితాపము – ఁపై వీచెనన్నదీ పవనంబుల్. ఆది. ౪. ౧౯.

తుడుచు :

తుడిచి : తల్లి బాష్పజలంబులు –. ఆది. ౪. ౨౪౧.

తుడిచికొనుచున్ : ఒడలు – నొయ్యఁచనియె. ఆది. ౭. ౨౦౪.

తుడుచుచున్ : వారల కన్నీళ్ళు -. ఆది. ౬. ౨౬౨.

తుడువంగన్ : వరవుళ్ళఁకలసి తనయిల్లు - (కృష్ణఁ పనుచు వగన్. స. ౨. ౨౦౦.

తునియు :

తునియఁగన్ : ఘనభుజుఁడన్నియు నడుమున-వడినేసి. ఆది. ౪. ౨౧౦.

తునిసి : కుఱుచునెడ వాని పెనుఁ(వేటు కూటిలోన - పడియున్న (వేల్ పుచ్చి. ఆది. ౭. ౨౫౮.

తునియన్ : దానిన్ - నర్జునుండు తన దివ్యబాణంబున నేయుటయు. ఆది. ౧. ౫౩.

తునియించినన్ : దాని మొదలు మెత్తన -. ఆది. ౪. ౨౬౮.

తునుము :

తునిమి : నెమ్మిన నీ దక్షిణహస్తమ్మున పెనుఁ(వేటు - దక్షిణాయుమ్ము. ఆది. ౫. ౨౪౩.

తునుముదున్ : మార్తురన్ - సంగ్రామ రంగంబునన్. స. ౨. ౨౯౭.

తూఁచు :

తూఁచి : దీనియంత నీమాంసంబు - నాకుఁ పెట్టు తూలఁగ కిపుడ. ఆర. ౩. ౨౩౪.

తూఁపగన్ : వెలయంగ అశ్వమేధంబులు వేయును ఒక్క- సత్యమును ఇరుగడలన్ తులనిడి — సత్యమువలన ములుచూపు గౌర వంబున పేర్మిన్. ఆది. ౪. ౯౫.

తూఱు :

తూఱిన్ : పాండుసుతుఁడంత నానాకాండ సహస్రముల నేసి ఘనముగఁ జేసెన్ ఖాండవ గృహమున ఖండాఖండల ధారలకుఁ - గాకుండంగన్. ఆది. ౮, ౨౭౧.

తూఱుచున్ : అనిలంబు...దివ్యద్రుమమా కీర్ణనందన సందోహముఁ - వికచ కేతక్యాది నానాలతాంతనవామోదము పొఁదుచున్ సుడియు. ఆది. ౮. ౭౯.

తూలు :

తూలంగన్ : పరుష కేశజాలంబు గాడ్పునఁ - గాలోప మానుఁడై మానుషాదుఁ డనుజఁజూచి. ఆది. ౬. ౨౦౨.

తూలన్ : అనలశిఖాలి - దనుజాంతక చక్రము రాజచక్రమెల్లను భయమంద. స. ౨. ౬౮.

తూలి : క్షిప్త పక్షతివాతాహతిఁ - తూల శకలాకారంబులై వారిదప్రతిముల్ బొల్పడి నల్గడన్ చెదరఁగా పాఱెన్ మనో వేగుఁడై పతగేంద్రుండు. ఆది. ౨. ౯౨.

తూలుచున్ : ధూళిధూసరాలకములు - చుండ. అర. ౨. ౧౧౬.

తూలు : కరువలిచేఁ - కపిలజటాలియ కర మొప్పు శిఖలుగా. ఆది. 3. ౧౮౨.

తూలెన్ : నెట్టన ధర్మనందనుఁడు సిన్నసలంబముచేసి ఓడతోఁ కట్టిన యోడవోలె గత గౌరవుఁడై కడుఁ -. స. ౨, ౪౦.

తెక్కలికొను :

తెక్కలికొని : అమృతము - ఆస్వాదింపక అలోలుఁడగు వానిఁచూచి, హరి యిట్లనియెన్. ఆది. ౨.౧౦౫.

తెగడు :

తెగడరు : ఏపుటడవిఁ ఉరు దుఃఖితుల సహోదరుల నందఱఁ బెట్టి చనుదెంచి మిన్నక చనిన నన్ను తగువారు జగములో - రే? అర. ౧. ౨౯౪.

తెగడినన్ : మ. ని ౪. ౧౧౯.

తెగు :

తెగన్ : నాపంచిన యప్పుడ యుప్పుక్షి తలఁ - నేయుండు. ఆది. ౫. ౨౪౭.

తెగి : చెచ్చెరఁ బక్షిశిరము -. ఆది. ౫. ౨౫౩.

తెగున్ : అదియును (ఒక్కవేరు) జరత్కారుం డనపత్యుండైనన్ -. ఆది. ౨. ౧౪౪.

తెచ్చు :

తెచ్చి : అప్పర్వతంబు -. ఆది. ౭. ౧౧; ద్రుపదు రథాక్షముతోఁ గట్టి - అర్జునుడు క్రియదక్షుండయి గురునకు గురుదక్షిణగా ఇచ్చిచేసెఁ దత్సమ్మదమున్. ఆది. ౬. ౭౭.

తెచ్చితెచ్చి : కన్యకలఁ - గాంగేయుండీ సలఘుఁడు ధృతరాష్ట్రుఁడు కులతిలకుండు వివాహమయ్యె దేవీశతము. ఆది. ౫ ౧౩.

తెచ్చికొని :

తెచ్చితిని :

తెచ్చితిమి : మే మొక్క భిక్ష -. ఆది. ౭. ౨౧౦.

తెచ్చిన : దేవార్థముగా - యాం వసుధాధిపుల నేల యే విడుతు? స. ౧. ౧౯౭.

తెచ్చినన్ : పాండవులన్ తోడ్కొని -. ఆది. ౫. ౧౫౨.

తెచ్చు: అమృతంబు -నప్పుడు లావు కలుగవలయు. ఆది. ౨.౫౪;
ఉత్తరీయంబు - నంతకు. అర. ౨. ౧౭౯.

తెచ్చెదను: అప్పాంచాలున్ పట్టి - నని, ఆది. ౬. ౭౬.

తెచ్చెన్: అనిలుఁడను దూతపోయి తోడ్కొనియు - దేవయాని పాలికి. ఆది. ౩.౧౫౬; ఈడ్చి తెచ్చె. స. ౨. ౨౧౬.

తెత్తము: పాంచాలుఁ బట్టి -. ఆది. ౬. ౬౬.

తెత్తున్: దానిన - నజేయుఁడనై. ఆది. ౨. ౫౩.

తెప్పించి: అక్కుండలంబులు - యిమ్ము. ఆది. ౧. ౯౬.

తెమ్ము: ఇద్దుర్మదున్ పట్టి - ఆది. ౭. ౨౦౮.

తేన్: మృతసంజీవని పడసి - నోపునట్టి మహాసత్వుండు. ఆది. ౩. ౧౦౨.

తేరన్: అమృతంబు - నరిగెద. ఆది. ౨. ౬౫.

తేరంబడియెడు: భగీరథు చేతఁ - గంగాజలౌఘంబులం జేసి, సంసిక్తులై సగరసంతతులు స్వర్గగతులగుదురు. అర. ౩. ౭౧.

తేక: మ. ని. ౮. ౯౪.

తెచ్చెదము: మేము వాని -. అర. ౩. ౧౪౮.

తెమల్చు

తెమల్చి: శిరోజములన్ -. స. ౨. ౨౧౬.

తెమల్చిన: - యంత కివ్వలన్. ని. ౫. ౧౬.

తెరలు :

తెరలఁగన్: మందర శిఖరంబు నెత్తికొని తద్దహనార్చు లడఁగు నట్లుగా - వైచినన్. ఆది. ౪. ౨౪౩.

తెరలన్ :

తెరలి : ముసులెల్లన్ - వచ్చి. ఆది. ౫. ...

తెఱచు :

తెఱచి : వదనగహ్వరంబు -. ఆర. ౧. ౧౦౭.

తెఱవక : కన్నుంగవ మొగిచి - యుండె. ఆది. ౪. ౨౫౪.

తెర్చి : పర్వత వివరము - విగుర్వింపుము. ఆది. ౭. ౨౭౫.

తెలియు :

తెలియంగన్ : దీని కల తెఱంగు — ఆసతియిండు. ఆది. ౩. ౫.

తెలియన్ :

తెలిసి : ద్రుపదుండతి హర్షరసావేశ పరవశుండయి పెద్దయున్ ప్రొద్దుసకుఁ -. ఆది. ౭. ౨౩౯.

తెలిపి : మ. ని. ౫. ౭౨.

తెలుపంగన్ : ఎఱిఁగి యెఱుఁగ నొల్లనికఱటిన్ - కమలగర్భుని వశమే ? ఆది. ౪. ౭౨.

తెలుపుచున్ : విదురుండు చెప్పి - నుండెన్. ఆది. ౬. ౧౫.

తెల్పెన్ : దేవమంత్రియుపోలె ధర్మువుఁ -. స. ౨. ౨౩౬.

తెవులుకొను :

తెవులుకొని : - యున్న మృగములఁ తివిరి యేయరు. ఆది. ౫. ౫౩.

తేఱు :

తేఱి : ...నియు నిద్ర -. ఆది. ౨. ౧౫౯.

తేఱెన్ : మూర్ఛ - నంతముదిత ద్రౌపది. ఆర. ౩. ౩౦౦.

తేలు :

తేలన్ : సకలజనులు శోకజలధిఁ -. స. ౨. ౩౦౨.

తేలుచున్ : మహాశోకంబున - చున్నవిదుర ధృతరాష్ట్రుల. ఆది. ౫. ౧౫౨.

తొలగు

తొలగి : ఉరుగుహాగృహములఁ - తొంగిచూచుఁ తోయజాక్షి. అర. ౨. ౯౫.

తొట :

తొట్టి : హిమకరుఁ - పూరుభరతేశ కురుప్రభు పాండుభూపతుల్. ఆది. ౧. ౧౪.

తొడంగు :

తొడంగన్ :

తొడంగి : రచియించెదనని -. ఆది. ౧. ౨౦.

తొడంగితి : ఏను -. ఆది. ౧. ౧౫౯.

తొడంగినన్ : అగ్నిముఖంబుచేసి వేల్వన్ -. ఆది. ౨. ౨౧౧.

తొడంగెన్ : ఇట్లనిచెప్పన్ -. ఆది. ౧. ౩౧; ౧౨౯,

తొడఁగి : ద్రుపదుండు నొక్కటఁ -. ఆది. ౭. ౫.

తొడఁగంగన్ :

తొడఁగినన్ :

తొడఁగిరి :

తొడఁగుము : రథముగడపఁ -. ఆది. ౬. ౫౫.

తొడఁగెన్ : పాములఁ గనినప్పుడ అడువఁ -. ఆది. ౧. ౧౫౨; అగు దానిఁ చెప్పఁ -. ఆది. ౩. ౧౧.

తొడఁగెదన్: ఈతపంబేఁ -. ఆది. ౨. ౧౪౨.

**తొడరు:**

తొడరి: - మీముప్పుర తొడనొండె. స. ౧. ౧౫౭.
తొడరినన్: కడునధికుతోడఁ -. స. ౧. ౧౨౪.
తొడరుచున్: విముక్త కేశయై - దుఃఖభావమున. స. ౨. ౩౦౭.
తొడరెడునది: పర్వతకందరోపాంత తతులఁ - వోలె. ఆర. ౩. ౩౮౭.

**తొడు:**

తొడి: కడువేడ్క - పూసికట్టి. ఆది. ౮. ౧౬౬; పొలుపుగ పూసి నట్టి -. ఆది. ౭. ౧౮౪.

**తొడుఁగు:**

తొడిగి: ఏడు బాణంబులొక్కటఁ -. ఆది. ౯. ౨౩౪.
తొడిగిన: తన - యుద్దివ్య భూషణంబుల. ఆర. ౪. ౯౬.
తొడువన్: కుడువను, కట్టను, - ఁపూయు. స. ౨. ౧౨౧.
తొడుగన్: అకుండలంబులు - సవసరంబై యున్నయది. ఆ.౧.౫౬.
తొడ్గ: అకుండలంబులు - దివసము. ఆది. ౧. ౧౧౯.
తొడువను:

**తొరఁగు;**

తొరంగన్: బాష్పకణంబులు - (రఁగన్). ఆది. ౪. ౮౭.
తొరంగు: కెందమ్మి రేకులవలనన్ - జలకణంబుల పోలె. ఆది. ౪. ౮౭.
తొరఁగన్: బాష్పకణంబులు - తలవాంచి (రంగన్) ఆది. ౪. ౮౭; పుష్పముల్ పయిన్ -. ఆది. ౭. ౧౮౯.

తొరఁగిరి : కుండాగ్నులందుఁ – పెలుచన్. ఆది. ౨. ౨౧౨.

తొరఁగు : బోరనఁ – బాష్పజలంబులు. ఆది. ౪. ౧౦౪.

తొరఁగుచున్ : పంక్తు తడబడి వారలతోన ధరణిమీఁదఁ – చుండ. ఆది. ౫. ౧౬౬.

తొరఁగెడు : గురుకుచయుగముపైఁ పరువడిఁ – కన్నీరు పూరించుచున్నదాని. ఆది. 3. ౧౪౦.

తొరఁగన్ :

తొఱఁగు :

తొఱఁగి : సురవరులఁ – తన్నున్ వరియించితి. అర. ౨. ౧౦౮.

తొఱఁగుచున్ : – చుండి. వి. ౫. ౧౮.

తొలఁగు :

తొలఁగక : – గ కే నెఱుంగుదును దృష్టి మాత్రన. అర. ౨. ౧౭౪.

తొలఁగి : – చూచుచుండుఁడు మీరల్. ఆది. ౭. ౧౯3.

తొలఁగుచున్ : ముండ్లకును అల్లిఁ –. అర. ౨. ౮౬.

తొలఁగుడున్ : జ్వలనంబు వాయువశమునఁ – జీవనము మాకు దొరకొను. ఆది. ౮. 3౧౦.

తొలఁగుదున్ : ఏను ధర్మ పథంబున నున్నవాఁడ; ఏల – ననిన. ఆది. ౭. ౧౧3.

తొలఁగున్ : – నె హింసాపరులకు దుఃఖప్రాప్తుల్. ఆది. ౪. ౨౭౧.

తొలఁగుము : తెరువు – మని రాజాభిమానంబున మెచ్చక పలికిన. ఆది ౭. ౧౧౧.

తొలఁగెన్ : అయ్యువిద వలువ –. ఆది. ౪. ౧౨3.

తొలంగన్ : మ. వి. ౫. ౯.

తొలంగుదురు: దురితంబుల వలనన్ -. ఆర. ౨. ౨౭౨.

తొలంగెన్: అగ్ని భయంబు - నేసి. ఆది. ౮. ౩౧౧.

తొలంగుఁడు: ని. ౪. ౧౧౪.

తొలుచు:

తొలిచి: అక్షముల్ - నేస్రశమమున ప్రతిపక్షతతుల సంపదలు జయించి నీకిచ్చెద స. ౨. ౧౪౭.

తోఁచు:

తోఁచి: కొనివచ్చుడు లోపల నల్లని క్రిమియై -. ఆది. ౨. ౧౯౬.

తోఁచిరి: కాలకేయులు బయల్పడి -. ఆర. ౩. ౩౯.

తోఁచు: నీరిలోనఁ - తారకప్రతిబింబ మొక్కొ. ఆది. ౫. ౨౦౭.

తోఁపఁగన్: అర్ణవంబు సమస్త సత్త్వాలి - పట్టినన్. ఆర. ౩. ౧౬.

తోకొను:

తోకొని: వానిన్ - పోవెదనని. ఆర. ౩. ౨౨౦.

తోడగు:

తోడయి: అభిమతంబుగ – నిర్వహింపఁగన్. ఆది. ౧. ౨౫.

తోడుకొను:

తోడుకొని: సుభద్రఁ – చనునెడ. ఆది. ౮. ౧౯౮.

తోడికొనుచున్: ద్రుపదతనూజను -. ఆర. ౩. ౨౮౪.

తోడుకొనుచున్: తనయుఁ నెమ్మిఁ – నిధిఁగన్న పేదయుపోలె సంతసిల్లి భూవిభుండు. ఆది. ౪. ౧౬౯.

తోడ్కొను:

తోడ్కొని: యాదవకళత్రంబులనెల్ల – వచ్చుచో. ఆది. ౧. ౬౫.

తోడ్కొనుచున్: సుభద్ర నంభోరుహనేత్రఁ — బోయెడి. ఆది. ౮. ౧౯౯.

తోడితెచ్చు :

తోడితేరన్: ధర్మనందనున్ - ప్రాతికామిన్ పంచిన స. ౨. ౨౭౪.

తోడ్తెండు: మధుసూదనుఁ - డని స. ౧. ౧౦౦.

తోడ్తేరన్: పాండవులన్ - విదురున్ పంచిన. ఆది. ౮. ౫౧.

త్రచ్చు :

త్రచ్చి: అబ్ధిఁ - నెడ. ఆది. ౨. ౧౨.

త్రచ్చు: అమలపయోరాశిఁ -. ఆది. ౨. ౮. ఏ క్రియన్ వారిధి - వారము. ఆది. ౨. ౯.

త్రవ్వు :

త్రవ్వన్: బలీవర్ధంబు ననముదలి విదారణంబు చేయు కాలు - నట్లు. స. ౨. ౧౮౩.

త్రావు :

త్రావన్: నిత్యము పాలు -. ఆది. ౫. ౨౧౬.

త్రావి: అవ్వసువీర్యబిందు ద్వయంబు —. ఆది. ౩. ౩౧.

త్రావించిరి :

త్రావిన: అక్కొలని నీళ్ళు - వారికి. ఆది. ౬. ౨౨౨.

త్రావుచున్: పాలు — నుండఁగాన్. ఆది. ౫. ౨౧౮.

త్రావుదురు: భారతవాగమృతంబు కర్ణరంధ్రమ్మను నంజలిన్ తవిలి —. ఆది. ౧. ౭౭; మేల్కనినీళ్ళు - గాక, ఆది. ౬. ౧౫౦.

త్రావున్ : గాండీవ నిర్ముక్త పతత్త్రి నిపీతారుణ వారి శేషము పతత్త్రి వ్రాతముల్ -. స. ౨. ౨౯౭.

త్రావుము : అమృత మయంబగు దీనిన్ -. అర. ౩. ౨౦౩.

త్రావెన్ : మహాబ్ధిజలంబులు - విష్టపానందకరుం డగస్త్యుఁడు. అర. ౩. ౩౯.

త్రిమ్మరు :

త్రిమ్మరి : ఈక్షణమ - వత్తు త్రివిష్టపంబులన్. ఆది. ౨. ౧౧౫.

త్రిమ్మరియెడు : ఇల నర్థశాస్త్రమును. సంధ్యలు రెండును భూత యక్ష దానవ గంధర్వుల - ప్రొద్దులు. ఆది. ౭. ౩౮.

త్రిమ్మరు : పుట్టలన్ పొదలఁ - పాముల రోసిరోసి. ఆది. ౧. ౧౫౩.

త్రిమ్మరుచున్ : దేవమనుష్య లోకములఁ -. ఆది. ౧. ౧౦౭.

త్రిమ్మరున్ : కనకగిరిన్ ప్రదక్షిణముగా శశిభాస్కర తారకాగణం బనవరతంబుఁ - మహామునిసప్త కమ డలంబుతో. అర. ౪. ౩౮.

త్రుంచు :

త్రుంచి : నడుము - వీచివైచె. ఆది. ౬. ౨౧౮.

త్రుంపక : ని. ౪. ౧౨౧.

త్రెంచు :

త్రెంపన్ : తన నెయ్యంబను తీఁగన్ - నేరక క్రమ్మఱివచ్చి. అర. ౨. ౭౮.

త్రెంచెన్ : ని. ౫. ౧౬.

త్రియ్యు :

త్రెస్సి : మహాదేహనిర్గత సాంద్రారుణపూర రొమ్ముక్కమొగి నోల్కన్ — (త్రస్సి). ఆది. ౨. ౨౪.

త్రెస్సెన్ : అనిలసుతుండంతన మేల్కని నీల్గుచు నతని వజ్రఘన కాయముఁ బొందిన లతికా జాలముసెల్లను - మృణాల నాళ లతికల పోలెన్. ఆది. ౫. ౧౭౨.

త్రెవ్వు :

త్రెళ్ళన్ :

త్రెళ్ళి : సెల్లుడట్లునేలఁ - చెచ్చెరలేచి. ఆది. ౭. ౨౦౪.

త్రెళ్ళినన్ : కట్టిన పుట్టంబు తడియన్ .. స. ౨. ౧౪౦.

త్రెళ్ళుచున్ : దిక్కుల్ చూచుచున్ తొడఁపుచుఁ - లేచుచు. అర. ౨. ౮౬.

త్రెళ్ళుఁడున్ : ప్రల్లదమేది యిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రి తుల్యుఁడై -. స. ౨. ౬౯.

త్రెళ్ళన్ : శల్యున్ - వైచిన. ఆది. ౭. ౨౦౩.

త్రెళ్ళన్ : ప్రమద్వర అవనిఁ -. ఆది. ౧ ౧౪౭. వసుంధరా తలమున - సారథియు. ఆది. ౫. ౧౭౭.

త్రెళ్ళఁగన్ : సర్పములెల్ల నగ్నిలోఁ -. ఆది. ౧. ౧౨౬.

త్రొక్కు :

త్రొక్కి : వాని శిరంబులు -. ఆది. ౨. ౧౧౪.

త్రొక్కన్ : ధర్మపథంబు తప్పఁ - నె? స. ౨. ౨౧౮.

త్రోచు :

త్రోచి: ఆ భస్మచయంబుకూడఁ –. ఆది. ౨. ౧౯౩.
త్రోచినన్: గంగమునుపునన్ –. ఆది. ౩. ౧౩.
త్రోచు: భస్మంబు పాయఁ – వాఁడపోలె. ఆది. ౬. ౧౬౭.
త్రోచుచున్: ఒండొరున్ పెనఁగి పెట్టుచుఁ –. ఆది. ౬. ౧౯౯.
త్రోతున్: అయ్యసురవాతఁ – అదయవృత్తి. ఆది. ౬. ౨౫౨.
త్రోతురు: అసురవాతఁ – రవ్వ యిట్టు. ఆది. ౬. ౨౭౧.
త్రోవన్: రక్కసువాతఁ – నెట్లాడంబడుదు. ఆది. ౬. ౨౭౩.
త్రోపించి: గంగమునుపునన్ – యు. ఆర. ౧. ౧౪౦.
త్రోచికొని: పరిధానం బెగఁ –. స. ౨. ౭౬.

త్రోయు:

త్రోయుచున్: తరువిటపలతాగుల్మంబులు కరతలంబునన్ పాయన్ – (త్రోచుచు). ఆర. ౩. ౨౯౬.

దక్కు:

దక్కిన: – కరము. వి. ౪. ౧౧౭.
దక్కన్: తద్వ్రతులు నీక – కురువీర! ఆర. ౧. ౭౪.

దరికొను: అంటుకొను,

దరికొని: – దహనుండెగసెను. స. ౧. ౨౫౧.
దరికొలిపి: తద్గృహద్వారంబునందు దహనంబు –. ఆది. ౬. ౧౪౦.
దరికొలుపన్: దహనంబు – (ప్రయోగింపన్). ఆర. ౧. ౧౪౦.
దరికొల్పన్: ంధనలంబు – బనిచిన. ఆది. ౩. ౧౪.
దరికొల్పున్: లక్కయింట దహనంబు – కావున. ఆది. ౬. ౧౫౭.

దాఁగు :

దాఁగినన్ : అయ్యాశ్రమంబులో -. (డాఁగినన్) ఆది. ४. ౨౬౨.

దాఁచు :

దాఁచిన ; ధనంబు - నవారము కాము. ఆది. ౭. ౧४౧.

దాఁట : పదునాలుగు వత్సరంబులు - నంతకున్ పురుషుండు బాలుండు, వాఁడెద్దిచేసినఁ పాపంబున్ పెద్ద పొరయఁడు. ఆది. ४.౨౭౨.

దీలపోవు :

దీలపోవక : యాదవసేనకున్ - (చేలుపోవక ..వీరు; తేలిపోవక.) ఆది. ౮. ౨౦౫.

దీవించు :

దీవించి : పౌష్యమహారాజున్ కాంచి -. ఆది. ౧. ౯౮.

దీవించిరి : — రాజులందు లోకోత్తర తేజోధర్మయుక్తిఁ దనరుమ యనుచున్. స. ౧. ౮౬.

దీవించుచున్ : పౌరులెల్ల - చుండ. ఆది. ౮. ౬४.

దీవించెన్ ; అభివంద్యవగుము యని -. ఆది. ౮. ౬.

దూఱు :

దూఱంగన్ :

దూఱుదు :

దూఱఁబడు ;

దొరకు

దొరకొను :

దొరకొనియెన్ : నీవఖిల ధర్మవిదుఁడవు కావున నీకిట్లు చేయఁగా —. ఆది. ४. ౧౮౯.

దొరకన్ :

దొరకొన్నె :

నగు :

నగంగన్ : ఈ యవనీశ్వరప్రవరు లిందఱు నిన్ను -. స. ౨- ౧౫.

నగరు : చుట్టములు నన్ను చూచి - రె ? ఆది. ౫. ౨౪.

నగవు :

నగి : వినత -. ఆది. ౨. ౩౧.

నగియును : - బొంకునందు వచనంబుఁ, అధర్మువు నందు చిత్తమున్ నగులను నాకు నెన్నఁడును. ఆది. ౭. ౨౫౨.

నగినన్ : వాలఖిల్య మహామునులన్ చూచి -. ఆది. ౨. ౮౫.

నగియెడు : ధ్రువ ఫేన వితతుల - నదివోలె. ఆర. ౩. ౩౮.

నగియెన్ : ద్రౌపది -. స. ౨. ౧౪౦.

నగిరి : పాంచాలియు పాండుకుమారులును -. స. ౨. ౮౬.

నగుచు : అనిన విని - వాఁడిట్లనియెను. ఆది. ౨. ౧౯౦.

నవ్వు :

నవ్వి : విని — వినతికు కద్రువ యిట్లనియె. ఆది. ౨. ౩౧.

నడచు :

నడచినన్ : దేవతలకు నెట్లు — నెగ్గులేదు. ఆర. ౧. ౩౬౫.

నడచిరి : నాలుగు దిక్కులపై — రనిన. స. ౧. ౨౨౬.

నడచు : వాలుపయి — నట్లబ్బాలిక. ఆది. ౨ ౧౫౬; నాలుగు సముద్రంబులపై - నపూర్వ సముద్రంబులుంబోలె స. ౧. ౨౨౬

నడచున్ : ద్వాపరంబున రెండు పాదములఁజేసి — ధర్మువు. ఆర. ౩. ౬౩౮.

నడతుము: ఏమెయ్యెడ నెప్పుడు — అధికశక్తి పురుషుల మగుటన్. ఆది. ౭. ౪౦.

నడపంగన్:

నడపుచున్: వానియజ్ఞంబు — ండి. అర. ౩. ౨౭౪.

నడుపుచున్: వేదవిహిత ధర్మంబులు —. ఆది. ౨. ౧౭౬.

నడవఁగన్: - నోఁడుదురశక్తి నరులోరులు. ఆది. ౭. ౪౦.

నడవన్:

నడువన్: ఇది — నోపదు. అర. ౧. ౩౦౨.

నడువము:

నడుపుము: భూవనంబుల — మని. ఆది. ౧. ౧౪౪.

నమ్మ:

నమ్మక: విచిత్ర వర్ణములగు నాత్మవాహముల — పల్మఱుఁచూచి. ఆది. ౮. ౭౭.

నమ్మన్: వీరు నమ్మంగఁతగుదురు, వీరు — ఁదగరు. ఆది. ౬. ౧౧౦.

నమ్మము:

నమ్మవు: — లేని వీరలపూర్వదేహంబులు చూడు మని. ఆది. ౭. ౨౭౭.

నమ్మి: తనకపకారము మునుజేసిన జనుఁడల్పుఁడని — చేకొని యుండక్ చనదొక యించుకముల్లయినను పాదతలమున నున్న నడవఁగనగునే? ఆది. ౬. ౧౧౬.

నమ్మించి: — చంపఁజనదు, మాయాబలంబునఁ చనదు చంప. ఆది. ౫. ౫౬.

నమ్మిన: కడు — ట్టులంబందదము. ఆది. ౬. ౧౫౭.

నమ్మ్రదురు : నలసారము సంసార, మఖిల దుఃఖావహము, భయ నికేతన మతి చంచలము; పరాధీనం; బంధుల జీవనమేల — తత్త్వవిదుల్. ఆది. ౬. ౨౪౮.

నమ్మనది : నాపలుకులు —. ఆది. ౬. ౨౨౨.

నలిరేఁగు :

నలిరేఁగి : కాంపిల్య నగరమున జనులెల్లన్ - ఆర్చి కౌరవబల సుభటులఁ పొడిచి రాజ బడలుపడంగన్. ఆది. ౬. ౭౨.

నవయు :

నవయక : మీరలింనుండి — హస్తిపురంబునకున్ చని. ఆది. ౫.౬౧.

నవయన్ : భీకర కాంతార నివాసా యాసంబుల ననఘా ! యుబ్బంగి — నలమట పొడమెన్. అర. ౧. ౨౧౩.

నవయు : శమతమ కనియెడు తఱి జీతమ కానక - భటుల దార్గత్య విషాదము లేలినవాని కవశ్యము నెగ్గొనరించు అతడు శక్రుం డైనన్. స. ౧. ౩౮.

నవయుచున్ : అత్యుగ్రవనముంగోన —. అర. ౧. ౧౨౨.

నవసి : పుణ్యవిహీనతఁ పతిఁపాసి, — ఏకాంతమ యీ కానలఁ పరిభ్రమించెద. అర. ౨. ౧౦౫.

నవ్వుపఱచు : అవమానించు.

నవ్వుపఱపన్ : - సమకట్టె నితండు విప్రవంశమ్మున వారినెల్ల. ఆది. ౭. ౧౮౦.

నాకు :

నాకుచున్ : దీర్ఘజిహ్వా నధరోష్ఠపుటంబు —. అర. ౩. ౧౯౫.

నాటు :

నాటన్ : ఒక్క - బాణం బభిమంత్రించి దృష్టి ముష్టి సౌష్ఠవంబులొప్ప నక్కుందుకంబు - నేసి. ఆది. ౫. ౨౧౧.

నాటుడున్ : అందు తనదృష్టి - గందర్ప నిశాత సాయకంబులు పెలుచన్ డెందముఁ గాఁడిన. ఆది. ౪. ౪౫.

నాఁటవు : తద్విషదంష్ట్రలు - వయ్యే. ఆది. ౩. ౧౩.

నించు :

నించి : సర్వసంభారములు -. స. ౧. ౨౮౩.

నించికొని : అపరిమిత భక్ష్యపిశిత మిశ్రాన్నంబు - పోయిన, ఆది. ౬. ౨౬౮.

నించిరి :

నించున్ : వనధిఁ పెద్దకాలమున భగీరథుఁడను వాఁడు - గాని. ఆర. ౩. ౪౬.

నించెన్ : దిక్కులన్ - యశంబు. స. ౧. ౧౭.

నింపన్ : ఒరులు పూని దీని - నోపరు. ఆర. ౩. ౪౬.

నిండు :

నిండన్ : తన్మంత్ర కలశోదకంబులెల్లఁ ద్రావెఁ కడుపు -. ఆర. ౩. ౨౦౨.

నిండగన్ : పడయనేల జలరాశి - జలమొండు. ఆర. ౩. ౪౬.

నిండి : జలనుపేక్షించుచు సంభవిల్లి కుంభముల్ -. ఆర. ౨. ౧౯౭.

నిండినన్ : ఒక్క సంవత్సరంబు -. ఆది. ౫. ౯౮.

నిండు : శతాపరాధంబులు - సంతకు. స. ౨. ౬౧.

నిండుడున్ : నవమాసమ్ములు -. అర. ౩. ౨౧౬.

నిండున్ : మీనాకరం బేమి తెఱఁగున -. అర. ౩. ౪౬.

నిండెన్ : దిశల్ - (డె డ). ఆది. ౨. ౨౩. పాండవుల విభవము ..
దిక్కులు — ఁతదీయ ప్రతాప నిర్మల రుచితోన్. స. ౨.౧౦౪.

నిడుచను :

నిడుచనన్ : వలకేల్ - గనయమునఁ బెనఁచి నీల్గి. ఆది. ౭. ౧౭౬.

నిలుచు :

నిలిచి : తల్లిముందట -. ఆది. ౩. ౪౬.

నిలిచిన : జగముల్ నీయంద - వికావే? ఆది. ౪. ౨౪౪.

నిలిచినన్ : ఎదుర -. ఆది. ౧. ౧౫౫; ప్రతిఘటించి -. ఆది. ౬.౩౯.

నిలిచిరి : భూతమ్ములు... ఒక్క మొగిన -. అర. ౧. ౩౦౦.

నిలిచెన్ : వచ్చి _ హరినీల...పరాశరసూనుఁడు. ఆది. ౪. ౨౪౦.

నిలుచుచున్ : వృక్షంబుల నీడల -. అర. ౨. ౮౫.

నిలుచున్ : ఎల్లలోకంబులు ధర్మువునంద -. ఆది. ౫. ౯౨.

నిలుము : చిక్కన —. ఆది. ౬. ౨౦౫.

నిలువన్ : కులము - ఁగా. ఆది. ౫. ౮.

నిలువుండు : ఇటచను దేరక - డ. ఆది. ౫. ౬౮.

నిలువదు : మ. ని. ౫. ౧౩.

నిల్చు :

నిల్చి : పంచాగ్ని మధ్యంబున —. ఆది. ౩. ౨౦౧.

నిల్చినన్ : అదల్చి —. అర. ౪. ౧౮.

నిల్చిరి : కుమారుల్ ... రంగమధ్యమున నంతన్ —. ఆది. ౬.౧౦.

నిల్చునది :

నిల్చెన్ : పాండవమధ్యముఁ డొప్పి ... రంగమధ్యమున —. ఆది. ౬. ౧౭.

నిల్వన్ : అధర్మవర్తులగు వారివరన మెన్నడున్ సమంజసమయి — నేరదు; భృశంబుగ నాశము పొందు. అర. ౨. ౩౧౨.

నిలుపు :

నిలిపి : గురుఁలతన హృద్వనజంబుల –. ఆది. ౧. ౭౬.

నిలిపికొని : దూరంబుగా అరదంబు —. అర. ౧. ౧౬౭.

నిలిపిరి : దృష్టుల – రయ్యువతి పయిన్. ఆది. ౮. ౧౦౬.

నిలిపెన్ : తపంబు వలనఁచిత్తము —. ఆది. ౩. ౪౫.

నిలుపు :

నిలుపుదు : అవ్విదురు వచనంబ — హృదయంబున. ఆది. ౮. ౧౯.

నిలుపుము : కీర్తి — మనిన. ఆది. ౮. ౩౩.

నిలుపంగాన్ : మ. ని. ౪. ౯౬.

నిల్పరు : ధర్మవిధి సంతతి — రె భూసురోత్తముల్ ? ఆది. ౪. ౨౨౬.

నిల్పి : ని. ౫. ౮.

నిల్పితిన్ : ఈశ్వరాగమములయందు — ప్రకాశముఁగా హృదయంబు భక్తితోన్. ఆది. ౧. ౧౦.

నిల్పున్ : అన్నువ కొఁదీఁగ యందంబు మది —. ఆది. ౩. ౕ౮.

నిల్పుము : రాజ్యము — మిత్త్రతిన్; ఆది. ౪. ౨౫౦.

నిల్పునది : వీనిమెది —. ఆది. ౩. ౨౦౬.

నిల్పె : గళఁబున — పొల్పుగాన్. ఆది. ౨. ౧౫.

నీల్గు :

నీల్గి : తద్బృంథంబులెల్లఁ తెగ —. ఆది. 3. ౧3.

నీల్గిన : నీప్రస్తవమునవని – వీరభటుల యసుపోష్యుల నెల్లప్రోతె?
స. ౧. ౪౦.

నీల్గుడున్ : అనిలసుతుండంత మేల్కని —. ఆది. ౫. ౧౭౨;
చూ. త్రెస్సె

నుడువు :

నుడివి : దాసీత్వంబు పణంబుగా — (నొ). ఆది. ౨. 33.

నుడువు :

నుడువక : — కుడుగు. ని. ౪. ౧౧౮.

నెగడు :

నెగడగన్ : యజ్ఞముల్ — ఁచేసియున్. ఆది. ౨. ౧౫౦.

నెగడన్ : వానిబుద్ధి — వలనదు. స. ౨. ౧౫౦.

నెగడుదున్ : ఏనుసపుత్త్రకుండైన వైచిత్రవీర్యు కార్యంబునకు హితుం
డనై —. స. ౨. ౧౯3.

నెనడునది : నిర్మలమతి — వినితాత్ములరై. ఆది. ౭. ౯౫.

నెగడున్ : వారివచనంబుల — నేనేమిచేయుదు? ఆర. ౧. 3౮౭.

నెగడెన్ : ఆవిశ్వకర్మ ... శిల్పప్రభావతియునై —. ఆది. 3.౬౮.

నెగయు :

నెగయుడున్ : — నెగసి పిఱుందన్ తగిమొదు మిడుఁగుఱులచేత.
అది. ౮. ౨౬౪.

నెగయుదెంచెన్ : నీరిలోన నుండ —. ఆది. ౫. ౧౭3.

నెగసి: జనసంఘంబు వలన —. ఆది. ౬. ౨౨.

నెగసినన్: సప్తాశ్వమండలంబు దాఁక —. ఆది. ౨. ౪౬.

నెగసెన్: తార్క్ష్యుఁడు తల్లికిన్ మనఃప్రీతి ఒనర్చుచున్ — భీమజవంబున నభ్రవీధికిన్. ఆది. ౨. ౩౮.

నెవయఁగన్:

నెరయు:

నెరయఁగన్: తరళనయనాబ్జ దళములు — ఁపైమున్న చల్లి. ఆది. ౩. ౧౫౭. చూ. చల్లు.

నెరసి: దివ్యానంత రత్నాంశుజాల స్ఫురిత సురవిమానంబుల్ నభో భాగమెల్ల - వెలుఁగు చుండన్. ఆది. ౮. ౧౯౬.

నెఱయు:

నెఱయన్: నీతిప్రయోగముల్ - నేర్చి. ఆది. ౫.౧౫.

నెఱయంగన్: ఱాలు నుఱుముగాఁగ నిట్లు - సత్త్వంబు మెఱసి. ఆది. ౬. ౧౬౧.

నెఱపు:

నెఱపి: మ. ని. ౫. ౩౫.

నెలకొను:

నెలకొని: - అతనికి నశ్వహృదయమనెడి విద్య యిచ్చి. అర. ౨. ౧౭౯. (మలయకతనికినీ వశ్వహృదయమను విద్య నిచ్చి)

నేర్చు:

నేరక: కర్ణునిన్...ఒడంబఱుప -. ఆది. ౧.౪౩; ఎఱుంగ -. ఆది. ౪.౧౬౬.

నేరఁడు :

నేరండు : నా యుదరంబు భేదిల్లినఁగాని యిమ్మునికుమారుండు వెలువడ -. ఆది. ౩.౧౨౪.

నేరదు : ఈ యజ్ఞము...కడచిన -. ఆది. ౨.౨౧౦.

నేరన్ : భారత భారతీ సముద్రము దరియంగ నఁదను విధాతృన కైనను - ఁబోలునే? ఆది. ౧.౧౯.

నేరని : ఎటయున్ చన - బాలకులను జనిన నిరీక్షించి. ఆది. ౮.౩౦౩.

నేరను : వీరలఁతోడ్కొని పోవఁగ -;......చన -; విధికృతము కడవ - ఁ గలావే? ఆది. ౮.౩౦౪.

నేరము ; ఇక్కన్య వివాహంబు చేయ -. ఆది. ౭.౨౩౭; ఒక్క దివసమైనను నుండ -. ఆర. ౧.౨౬.౫.

నేరరు : తగియెడు పుత్త్రులన్ పడసి ధర్మువు తప్పక తమ్ము నుత్త ముల్ పొగడఁగ మన్మహామతులు పొందుగతుల్ కడు ఘోర నిష్ఠతో తగిలి తపంబుచేసియును, దక్షిణ నిమ్ముగనిచ్చి యజ్ఞముల్ నెగడఁగఁజేసియున్ పడయ - రపుత్త్రకులైన దుర్మతుల్. ఆది. ౨.౧౫౦.

నేర్చి : విషతత్త్వ సంహితా నిపుణులు మంత్రతంత్రములు - విధించియు. ఆది. ౧.౧౫౦.

నేర్చితిన్ : జీవింపనేర ; - నేనియు ఇక్కుమారుల రక్షింపనేర. ఆది. ౬.౨౫౯.

నేర్చితిమి : వనమునందు పంద్రెండు సంవత్సరంబులుండ - మేనియు. ఆర. ౧. ౨౬.౫.

నేర్చిన : సకలధర్మశాస్త్రాది బహువిధ శాస్త్రముల్ శుక్ర బృహస్ప తుల్ - యట్లు నేర్చె. ఆది. ౪.౧౬౯.

నేర్చు: నీ - విధంబున దాని చిత్తంబుపడసి. ఆది. ౩.౧౦౭.

నేర్చున్: చూ. తోడ్కొను (ఆది. ౪.౮౦.)

నేర్పెన్: చూ. నేర్చిన. వీరవై రిపతాకినీ భేదమార్గములెల్ల - అభేద్య విక్రమసంపదన్. ఆది. ౮.౨౨౭.

నేర్తు: నీ యిచ్చిన శాపంబు క్రమ్మఱింప - ర్తేని లగ్గగు. ఆది. ౨.౧౭౮.

నేర్తురు: నీ విహితస్మితియు సలుప - రె? ఆది. ౪.౧౮౯.

నేర్తున్: అసత్యం బెట్లుపలుక -. ఆది. ౧.౧౩౮.

నొడువు:

నొడివి: నిన్నుఁ దోడ్కొనిరా నస్మత్ప్రధాన వర్గంబుఁ గణ్వ మహా ముని పాలికిన్ పుత్తెంచెదనని ఊఱడ - దుష్యంతుండు నిజ భవనంబునకున్ చనియె. ఆది. ౪.౬౧.

నొడివియున్: తడయక సామభేదముల దానములన్ దయతోడ నమ్మఁగా - సత్యమిచ్చియు చనున్ జననాథ కృతాపకారులన్ కడగి వధింపఁగా ననుట కావ్యమతంబిది కాన యెట్టులున్ కడుకొని శత్రులన్ చెఱుపఁగాఁచుట కార్యము రాజనీతికిన్. ఆది. ౬.౧౧౯.

నొడివెడు: ఎగ్గుల్ - వివేకశూన్యుల కడనుండెడు కంతకంటె కష్టము కలదే? ఆది. ౩.౧౪౯.

నోఁచు:

నోఁచితిని: ఇప్పాటి నోములు తొల్లి కడఁగి - గాకేమి యనుచును కందె డెందమున. ఆది. ౪.౧౦౩.

నోఁచిన: పురుషునికంటె మున్ను పరలోక మేఁగిన సతియ - నిదియ,

సతులలోనఁ బురుషహీనయైనఁ బరమపతివ్రత అయ్యు జగము చేతఁ బ్రయ్యఁబడదె? ఆది. ౬. ౨౫౬.

పంచు :

పంచి : తన శిష్యులయిన పైల వైశంపాయన సుమంత జైమిను లన్ - క్రమంబున చతుర్వేదసూత్రంబులఁ జేయించి. ఆది. ౧. ౩౧.

పంచితి : రాజకృత్యములఁ దిరంబుగా నిఖిల నియోగవృత్తులందు యోగ్యులయినవారిఁ గరము గారవమ్మున - తె నీవు వారి దయిన నేర్పెఱింగి. స. ౧. ౨౬.

పంచితిన్ : ఖలు నసురనోర్వనోపెడు బలయుతుఁగా నెఱిఁగి కొడుకుఁ-ఁగాకిమ్ముల శతపుత్త్రులు గల ధన్యులకైన అనిష్టుఁడగు తనూజుఁడు కలఁడే? ఆది. ౭. ౨౭౭.

పంచితిరి : మీరు - రో! చెచ్చెరఁ తాన ఉపక్రమించెనో! ఆది. ౬. ౨౭౯.

పంచిన : కర్కోటకుండనువాఁడు తల్లి - రూపంబున. ఆది. ౨. ౩౭.

పంచినన్ : మృగమాంసంబు తెచ్చిపెట్టుమని తన పితృదేవతలు - నప్పుడయ్యుపరిచారుండు. ఆది. ౩. ౨౬.

పంచిరి : సభ్యులు నిన్ను రాఁ - రమ్మనిన. స. ౨. ౨౧౨.

పంచెదన్ : నిన్నొకఁడు -; చేయుము మత్ప్రియంబుగాన్. ఆది. ౪. ౨౨౦.

పంచెన్ : నన్ను శుక్రుఁడు -. ఆది. ౩. ౧౭౬.

పంపు :

పంపన్ : మఱియొక్క గౌరవగ్నుండు - ఁ గడఁకతోడ. ఆది. ౭. ౨౨౩.

పంపక : తపోభారము తాల్చియుండుమని - మిన్నక ఉండనిచ్చునే! ఆర. ౨.౩౨౯.

పంపంగాన్ : అయ్యిరువురు - పెఱికి. ఆది. ౨.౧౦.

పంపు :

పంపుము : స్వయంవరం బిప్పురంబున ఘోషింపన్ -. ఆది. ౭.౨౫.

పడసి : అమ్మహాత్ము ననుగ్రహంబు -. ఆది. ౧.౯౪.

పడసియు : చూ. పడయని.

పడసితిన్ : తనువును జీవము సత్త్వంబును -. ఆది. ౩.౧౨౩.

పడసితివి :

పడసిన : త్రిభువన రాజ్యంబు - ంతియసంతసిల్లి. ఆది. ౫.౧౨౮.

పడసినన్ : కొడుకులన్ పెక్కండ్రన్ -. ఆది. ౪.౨౨౭.

పడసిరి : - పలువురం గొడుకులం గూంతుల. ఆది. ౩.౫౧.

పడసెన్ : సత్పుత్త్రు నభిమతంబున - ఆది. ౩.౧౬.

పడసితిరి : నాయందు మున్న -. ఆది. ౬.౨౫౫.

పడసెను : జ్ఞానము -. ఆది. ౧. ౯౩.

పంచు :

పంచి : ఏస్వరంబులను భీష్మపర్వము - వినన్ పోలుచు. ఆది. ౧.౪౬; ౮.౮౫.

పంచిన : - శోకభారమునం బ్రాణవిమోక్షము గోరి. ఆది. ౭.౧౨౦.

పట్టక : క్రవ్యాది ఘోరమృగముల తనబుద్ధిం - కుండం జెట్టుపలం గప్పి. ఆది. ౪.౪౭.

పట్టు :

పట్టి : పెఱచేత గజంబు -. ఆది. ౨.౭౦.

పట్టికొనన్ : నందినిన్ - ం బంచినన్. అది. ౭.౧౦౩.

పట్టికొని: అప్పాంచాలు నోడించి - తెండు. ఆది. ౭.౬.
పట్టికొనినన్: వానిన్ (ద్రుపదు) -. ఆది. ౬.౮౭.
పట్టికొంటివి:
పట్టికొనియెన్:
పట్టితి: నాదు దక్షిణకరాబ్జము -. ఆది. 3.౧౬౦.
పట్టిన: తను - సురియ నప్పెనుపాము వదనంబు బ్రయ్యన్ తఱిగిన. ఆర. ౨.౮౯.

పట్టు:
పట్టుకొని: మృదుండు కడంగి - బ్రమింగి. ఆది. ౨. ౧౫.
పట్టుకొనుడున్: వానిపిఱుందన పాఱి -. ఆది. ౧.౧౦౨.
పట్టుచున్: బాలహరిణములఁ పట్టెడు లీలను విషమాటవీచలిత కేసరి శార్దూలేభ శరభములఁ తన బాలత్వమునంద యెగిచి - మఱియున్. ఆది. ౪.౬.
పట్టుడున్: నేను వానిన్ (మనుష్య శకలంబులు రెండును) కూడఁ - నప్పుడ వజ్రఘనఘటితశ కఠిన శరీరుండై యిక్కుమారుండు. స. ౧. ౧౫౨.
పట్టెడు: చూ. పట్టుచున్.
పట్టెన్: అభిషిక్తుండయిన యయ్యమరరాజ సుతునకు సాత్యకి మౌక్తిక చ్ఛత్త్రమొప్పఁ -. స. ౨. ౧౧౯.
పట్టుకొనుడు: మ. ని. ౧. ౧౦౨.

## పచరించు:

పచరింతురు: వననిధిలోని రత్నముల వాసుకి మూర్ధజరత్న సంఘముల్ కొనఁగ అవశ్యమున్ జనులకున్ సమకూరదు; కాన నెప్పుడున్ కొనుఁడు పదార్థ రత్నములు కోరినవానిన యిత్తు

మత్తె (న్తె) అంగునఁ — రంగడులఁ గోమటు లప్పారి నిద్ధరత్నముల్. ఆది. ౮. ౭౩.

పట్టువడు :

పట్టువడన్ : అతఁగులచే ద్రుపదుఁ డనవహితుఁడై — నంత హీనుఁడె? ఆది. ౬. ౬౯.

పట్టువడి : పవననందనుఁడొక పన్నగుచేతఁ — ఆర. ౪. ౧౦౧.

పట్టువడితి : అబల ! యెవ్వరిచేత అడవులలోఁ —. ఆర. ౨. ౧౩౩.

పట్టువడియెన్ : సాల్వుచేత నక్కడ వసుదేవుండు —. ఆర. ౧. ౧౯౦.

పట్టువడున్ : వసుదేవుఁడేల — ! ఆర. ౧. ౧౯౦.

పట్టునఱచుచున్ : కూఁతున్ — చున్నంత. ఆది. ౩. ౧౫౦; శిశుపాలున్ — ధర్మరాజు నకు. స. ౨. ౨౧.

పట్టువఱుపన్ : వీనినేల భూపాలక ! నీకు —. స. ౨. ౨౨.

పడయు :

పడయక :

పడయన్ : — ఁబోలు. ఆది. ౧. ౭౨.

పడయంబడిన : మొదలి పెక్కు జన్మములఁ పుణ్యకర్మముల్ పరఁగ పెక్కు చేసి — యట్టి యెఱుక జనులకు ఆ క్షణమాత్రన చెఱుచు మద్యసేవ. ఆది. ౩. ౧౨౦.

పడయంబడు : భార్యయందు — సపత్యంబు నా యందు మున్న పడసితిరి. ఆది. ౬. ౨౫౫.

పడయఁబడిన : — పుణ్యఫలము. ఆది. ౧. ౭౨.

పడయంగఁబడిన : నీచేతఁ — దీసి నగ్ని సన్నిధిఁ పాణిగ్రహంబు నీవ చేయుము. ఆది. ౭. ౨౧౧.

పడయను : సంతానంబు — నొల్లకున్న వాఁడు. ఆది. ౨. ౧౪౪.

పడయుచును :

పడయు : సంతతి — ధర్మువన ధర్మసతీ! ఆది. ౫. ౮౪.

పడయుదును : దీనికి ధృతరాష్ట్రు నను జ్ఞానము - మనకు. స. ౨.౧౦౦.

పడయుదున్ : కొడుకున్ త్రిలోకవిజయున్ — నని. ఆది. ౫. ౧౧౬.

పడయుదురు : దేవసాయుజ్యంబు —. స. ౨. ౧౫౧.

పడయుదువు : అక్షయలోకంబులున్ —. ఆది. ౫. ౮౦.

పడయున్ : విప్రుఁ గాచి సత్పుణ్యలోకములు —. ఆది. ౫. ౨౭౬.

పడయుము : సంతతియు — మొగిన్. ఆది. ౪. ౨౨౧.

పడయని : కొడుకులఁ పలువురఁ పడసియు — యట్టిదయి. అర. ౩. ౫౨.

పడు :

పడక : పాత్రోన్ముఖుఁడైన వానిఁ — కుండఁగ. ఆది. ౨. ౨౩౫.

పడన్ : — నీవింక సహశ్యము నుడిగింతును సర్పయాగము. ఆది. ౨. ౨౨౨.

పడఁడు : ఒక్కరుఁడ కరంబిసుమఁ — డె కాననసీమన్! అర. ౨. ౬.

పడదు : పానకపుఁబు నొక్కచినుకు — దయ్యె. ఆది. ౭. ౨౬౯.

పడి : అకన్యపై — లజ్జయుఁ పాపఁగడఁగు. ఆది. ౩. ౩౭.

పడితిన్ : అట్టి యిడుమలఁ —. అర. ౨. ౨౧౦.

పడిన : — యనినాని కద్రూసుతులన్. ఆది. ౨. ౨౨౨.

పడినన్ : ఇది భూమిపయిన్ — నిమ్నునులకు బాధ అగు. ఆది. ౨. ౮౪.

పడియెడు : జరత్కారుఁగని చెప్పవయ్యవాని నెఱుఁగుదేని మా — నీయవస్థ. ఆది. ౨. ౧౪౫.

పడియెడున్: మన్మథు నొంటిపులఁ — నితండు. ఆర. ౨. ౧౩౫.

పడియెన్: దేహము ధరణిఁ —. ఆది. ౨. ౧౯.

పడిరి: — రుదాత్తాశ విషాగ్నుల్ ... పల్వురుద్ధత నాగేంద్రులు బ్రహ్మదండహతి నార్తధ్వానులై వహ్నిలోన్. ఆది. ౨. ౨౧౪

పడుదున్: అలుకయ — గాక. ఆది. ౨. ౧౫౯.

పడున్: సత్యము చెప్పని వాఁడును ఘోరమైన నరకపంకమునఁ —. ఆది. ౧. ౧౩౭.

పదరు:

పదరి: గరు డనిన్ —. ఆది. ౨. ౪౬.

పదరుచున్: ప్రసూతి గాకున్నన్ —. ఆది. ౫. ౯౮.

పదరున్: భూసురప్రవరుండు — నో! ఆది. ౨. ౧౫౯.

పనుగొను:

పనుగొనన్: గాంగసైకత భూములన్ — ధనువభ్యసించుచు. ఆది. ౪. ౧౬౫; తన్మునినాథుఁ—ఁతీరంబుచేరఁ బెట్టి విపాశ నాఁ పరఁగె. ఆది. ౭. ౧౨౩.

పనుచు:

పనిచి:

పనిచిన: తనయుండు తల్లిదండ్రులు — పనిచేయఁడేని పలుకెదలో చేకొనఁడేని వాఁడు తనయుం డనఁబడునే, పితృధనమున కర్హుం డగునే! ఆది. ౩. ౧౯౯.

పనిచినన్: గర్భంబు లిమ్ముగా రక్షింపన్ —. ఆది. ౨. ౪.

పనిచెన్ : దేవలోకంబునందు వక్కాణింప నారదున్ —. ఆది. ౧. ౬౭.

పనుచు : తనయులు పరువడిఁ దుడువంగ తృష్ణఁ — పగన్. స. ౨. ౨౦౦.

పనుపన్ : కురుపతి — ఉలూకుండను దూత. ఆది. ౧. ౪౩.

పనుపుండు : నన్ను — డిష్టంబేయది దానిన తెత్తు. ఆది. ౨. ౫౩.

పనుపవు : దుర్జనులన్ — గా రాచకార్యభారము తాల్పన్. స. ౧. ౪౧.

పనుపుదు : యోగ్యులయినవారిఁ కరము గారవమున - దె? పంచితె? స. ౧. ౨౬.

పనుపుము : ఆ రక్కసు రాఁ — మని. ఆది. ౬. ౨౦౧.

పనువు :

పనివి : బకహిడింబులు హతులైనఁ — అఱచి, శోకింపఁగానక యమపురమున కరిగి తక్కటా! రాక్షస! అనుచుఁ తెరువు పాయఁ పావనితత్ (కిమ్మీరుని) కళేబరము వైచె. అర. ౧.౧౨౦.

పన్ను :

పన్ని : వేఱువేఱ - భూతలము గ్రక్కదల సైన్యపాద ఘట్టనమునఁ బొలుచు ద్రుపదరాజపుత్త్రీ స్వయంవర రంగమునకు చనిరి రమణ తోడ (రాజులు). ఆది. ౭. ౧౬౬.

పన్నిన : వాని — వృషభ గోమయ భక్షణంబు చేసి. ఆది. ౧.౯౪.

పమ్ము :

పమ్మిన : — కృష్ణు బీరమ్ములు పొగడుచు. స. ౨. ౪౧. ఉగ్రతన్ — యట్టి కోపపరు పాలికి భామలు పోవనోడరే. ఆది. ౪. ౩౮.

పరఁగు :

పరఁగన్ : పుణ్యకర్మములన్ — పెక్కుచేసి. ఆది. 3 ౧౨౦.

పరఁగి : లోకాగమన్యాయమై కాంత గృహంబునాఁ —. ఆది. 3.౧౧.

పరఁగిన : జరత్కారుఁడునాఁ — ముని బ్రహ్మచర్య పరిపాలకుఁడై. ఆది. ౨. ౧౩౯.

పరఁగినన్ : అట్టి భృగునకు పుత్త్రుండై పుట్టి —. ఆది. ౧. ౧౪౪.

పరఁగిరి : అయ్యేవురు వాసవులు వేఱువేఱ వంశకరులయి —. ఆది. 3. ౨౬.

పరఁగు : పరీక్షితుఁడు నా — వాఁడు. ఆది. ౨. ౧౬౫.

పరఁగుచున్ : — చున్న రాజరాజ నరేంద్రుండు. ఆది. ౧. ౨.

పరఁగున్ : — కర్ణపర్వ మతిహృద్యంబై. ఆది. ౧. ౫౦.

పరఁగుము : నీవు నిత్యుండవగుచు — మని. అర. 3. 33౧.

పరఁగెన్ : మౌసలపర్వంబునాఁ —. ఆది. ౧. ౬౫.

పరంగెన్ : ఆ శమంతక పంచకంబు కురుక్షేత్రంబునా —. ఆది. ౧. ౯౨

పరఁగెడు : ధరణినధార్మికులగు కాపురుషుల కభివర్ధనంబుఁ, పుణ్యచరిత్రన్ — ధార్మికులకు దుర్భరమగునవి నర్ధనంబు తగునె? అర. ౨. 3౧౦.

పరికించుచున్ :

పరికించుచున్ : — బాహ్యాభ్యంతర జనముల వలన సంతతమూ నిజ రక్షాపరుఁడవయి పరమహీశుల చరితము వీక్షింతె నిపుణచర నేత్రములన్. స. ౧. ౪౯.

పరికింతు : వెలయఁగ విద్వజ్జన ముఖ్యులతోడ అశేష ధర్మకుశలుఁడవయి యిమ్ముల లోకవ్యవహారమ్ములు దయఁ - తె నిత్యము సమబుద్ధిన్. స. ౧. ౫౦.

పరికింపఁన్: ధృతిచెడి వేఁడెడు వానిని, అతిథిని, అభ్యాగతుని, భయస్థుని శరణాగతు చంపగ ఒడబడు దుర్మతి కిహమున్ పరము కలదె మదిఁ –. ఆది. ౬. ౨౭౪.

పరికింపండు: ఫలార్థి యైనవాఁడు తత్ఫలాను బంధంబులయిన దోషంబులు –. ఆది. ౭. ౧౨.

పర్వు:

పర్వఁగన్: పర్వతములు పెఱికి ఒండు పర్వతములపైఁ – వైచుచు యౌవన గర్వంబున నొప్పె. ఆది. ౪. ౭.

పర్వన్: ఎత్తికొని –. ఆది. ౧. ౧౫౧.

పర్వి: పదునెనిమిది పర్వముల –. ఆది. ౧. ౩౬.

పర్వితిన్: నేను నృపకోటి నమస్కృతిఁ కీర్తిఁ –. స. ౨. ౮౧.

పర్విసన్: విషముద్భవిల్లి నల్గడలను విస్ఫులింగములు కప్పఁగఁ –. ఆది. ౨. ౧౫.

పర్వుచున్: – వైరాటాదిక పర్వచతుష్టయమునను సభారంజనమై సర్వమనోజ్ఞము నాల్గవపర్వము నాఁ దగి విరాటపర్వము వెల యున్. ఆది. ౧. ౪౨.

పర్వెన్: పాతాళైక నికేతనాంతరము నన్ – తదశ్వాఖిల స్రోతో మార్గ వినిర్గతోగ్రద హనార్చుల్. ఆది. ౧. ౧౧౨.

పర్వున్: నీకీర్తి త్రిజగంబు లందుఁ –. అర. ౪. ౯౯.

పఱచు:

పఱచి: కన్నియలందఱు వెఱచి – అఱచుచుండ ప్రమద్వార అవనిఁ ద్రెళ్ళ. ఆది. ౧. ౧౪౭.

పఱచిన: ఇభకచ్ఛపముల రౌహిణ శాఖతో ఎత్తుకొని దివి – యనిల వేగి. ఆది. ౨. ౮౪.

పఱచిరి : అశ్వినులు నుత్తరమున కొనరఁ —. ఆది. ౨. ౧౦౦.

పఱచు : ఆకాశంబున — నప్పుడు. ఆది. 3. ౨౮.

పఱచుచున్ : ఆశనాపేక్షఁ — న్న ఉగ్రసృగంబుల ఉదరంబులో ఉన్న దానవే? అర. ౨. ౧33.

పఱచుకొని : పయి ఘుట్టంబులు —. ఆది. ౬. ౧22.

పఱచున్ : ఈహయంబులు పవనగతిన్ —. అర. ౨. ౧౬౮.

పఱచెన్ : గగనవీథిన్ — వియచ్చర విమానపంక్తులు. ఆది. ౨. 2౮. (20.)

పఱవన్ : విహంగతతులు భీతిన్ —. ఆది. ౨. 23. ౬. ౮3.

పఱచు : ఒక్క నిముషంబున మున్నూట యఱువది నాలుగు యోజనంబులు — నాదిత్యరథంబుతో. ఆది. 2. ౮౮.

పఱతెంచు :

పఱతెంచి : అది (సరమ) అఱచుచున్ — తమ తల్లికిన్ చెప్పిన. ఆది. ౧. ౮౪.

పఱతెంచినన్ : కర్ణు నొద్దకున్ —. ఆది. ౬. ౫౨.

పరతెంచెన్ : భీముపయిఁ —. అర. ౪. ౧౪.

పఱపినన్ : రథంబు — దాని సహింపక. అర. ౧. ౧2౫.

పఱవుము : రథంబు —. అర. ౧. ౧2౨.

పఱపెన్ : దివ్యరథంబుఁ తత్సురాహిత పురి భూరి క్రమము పయిన్ —. అర. ౪. ౮౨.

పలుకు :

పలికి : ధృతరాష్ట్రుఁడు నన్నొల్లక యెగ్గులు —. అర. ౧. ౬౦.

పలికితి : నిన్నవశ్యంబును విడువనని —. అర. ౨. ౮౪.

పలికితిన్: అలుక మెయిమున్న —. ఆది. ౨. ౧౭౯.

పలికితిమి: పెక్కు పరిహాసంబుల్ రూఢిగఁ —. ఆది. ౮. ౧౫౬.

పలికితిరి: నిన్నుఁగఅపుడుననిమున్ —. ఆది. ౫. ౨౩౯.

పలికితివి: నీవధ్యయనంబునకు వక్రంబుగాఁ —. అర. ౩. ౨౩౯.

పలికిరి: ఆయుధవిద్యా రహస్య ప్రయుక్తులు —. ఆది. ౭. ౨౨౮.

పలికెదరు: జగజ్జన సంక్షయ జనకుండగునని —. ఆది. ౫. ౧౧౦.

పలికెదు: — పలువ! ఎఱుంగవు పరాత్మ పరిమాణంబుల్. ఆది. ౬. ౩౬.

పలికెన్: ఈ తనుమధ్య వివాహ మయ్యెదము నని —. ఆది.౭.౨౪౮.

పలికిన: మాండవ్యుండు — పలుకులు. ఆది. ౪. ౨౬౮.

పలికినన్: ఎగ్గులు — మఱి విననియట్లు. ఆది. ౩. ౧౪౭.

పలికెడి: ప్రియము — వారిన పెద్ద మెత్తురు. స. ౨. ౧౯౧.

పలికెడు: ఉడుగక యే మహితము — వారము. ఆది. ౮. ౪౦.

పలుకక: — వశిష్ఠుండు చూచుచుండి. ఆది. ౭. ౧౦౩.

పలుకఁబడు: నాచేతఁ — డియ. అర. ౨. ౨౧౨.

పలుకండు: ఈవిదురుండెప్పుడు నరిష్టంబకాని —. స. ౨. ౨౦౫.

పలుకదు: — సఖులతో లలితాంగి. అర. ౨. ౨౬.

పలుకరు: — రెవ్వరు. స. ౨. ౧౯౧.

పలుకన్: అసత్యంబెట్లు — నేర్తు? ఆది. ౧. ౧౩౮; అనుచితంబులు —ఁగా నేల? ఆది. ౪. ౭౭; పరపురుషులతో — నోప. అర. ౨. ౧౨౧.

పలుకవు: ఇభపురేశ! — విట్టులేల? స. ౨. ౯౨.

పలుకుచున్: తమలో — న్న సమయంబున. అర. ౧. ౫౬.

పలుకుదున్: పతినన్వేషించు పొంటె నరిగెడు బ్రాహ్మణులతో —. అర. ౨. ౧౨౧.

పలుకుదు: నీ వెన్నఁడేని నన్ను నప్రియంబులు — దప్పాడ. ఆది. ౪. ౧౫౦.

పలుకుదురు: మంత్రులు తమ తమ బుద్ధి దోషంబుల నెల్లునున్ —. ఆది. ౮. ౩౯.

పలుకున్: ధర్మమార్గంబేల తప్పఁ —. ఆది. ౭. ౨౫౬.

పలుకునది: పరిమితమును నగు పలుకొనరఁగఁ —. ఆది. ౩. ౨౦౫.

## పల్కరించు:

పల్కరించిరి: కలయఁగఁ — రుపకారులు నేరని. ఆది. ౪. ౭౦.

పల్కి: మహాపురుషంబులు —. ఆది. ౧. ౧౩౯.

పల్కుదు: దమయంతిఁ పతివ్రతఁ — దే? ఆర. ౨. ౨౧౭.

పల్కున్: దుందుభి మహాహిభయంపడి - భార్గవున్. ఆది. ౧.౧౫౩; అభిలాష మేర్పడు నట్లుండఁగా —. ఆది. ౩. ౩౮.

పల్కెడు: నీవు హితవు క్రియ గొనఁగాఁ - వాడవు. ఆది. ౮. ౪౦.

పల్కెదు: జనయిత్రి వంచు నొకనాడు - వక్రభాషలన్ —. ఆర ౧. ౩౬౧.

పల్కెన్: శకుంతల సత్యము - సాధ్వి. ఆది. ౪. ౧౦౫.

పల్కితిన్: ఇంతుల యొద్ద —. ఆది. ౭. ౫౯.

పల్కిన: నాఁడు - విధంబెడఁ తప్పఁగ వీడెనొక్కొ. ఆది. ౪. ౭౦.

పల్కిరి: అప్రతిమ హోనిభాసి గని —. ఆది. ౭. ౧౪౦.

## పాచు:

పాచి: నాహృదయ శల్యంబుఁ —. ఆది. ౬. ౧౩౧.

పాచికొందున్:

పాచికొని: నిజసైన్య నిరోధంబుఁ —. ఆర. ౨. ౧౮౨.

పాచిన : పితృగణంబు వలన ఋణంబుఁ - మహోపకారి. ఆది. ౬. ౨౫౧.

పాచు : శూలంబు వలన నమ్మునిన్ — చో. ఆది. ౪. ౨౬౮.

పాచున్ : భార్యయ —ఁ చిత్తమున దుఃఖంబున్. అర. ౨. ౭౫.

పాచెన్ : తదీయసేన కగ్ని భయముఁ —. స. ౧. ౨౫౯.

పాతున్ : ఏనెట్లు దానిఁ —. ఆది. ౫. ౭౧.

పాతారు : తృష్ణఁ — సుమతుల్. అర. ౧. ౨౫.

పాపన్ : లజ్జయుఁ — ఁకడఁగు. ఆది. ౩. ౩౮.

పాపి : ఘోర సంసారవికార సంతమస జాలముఁ —. ఆది. ౧. ౨౨.

పాపికొనన్ : నీదయిన దాస్యము — ఁగ (పాచి). ఆది. ౨. ౫౫.

పాపికొని : అర్జునున్ — పోయి. ఆది. ౧. ౪౭.

పాపికొనినన్ : మదీయదాస్యంబు — (పాచి). ఆది. ౨. ౧౧౩.

పాపిన : మిమ్ముఁ — కురుపతి. ఆది. ౬. ౧౪౭.

పాపున్ : నీ దాసీత్వంబు — నని చెప్పి. ఆది. ౨. ౭.

పాపుము : మత్సైన్య నిరోధము —. అర. ౩. ౧౮౧.

పాపెన్ : ప్రమద్వరను పంచత్వంబు వలనన్—. ఆది. ౧. ౧౫౧.

పాడు :

పాడితిమి : వేడుక నమ్ముని ముందటఁ — మాడితిమి. ఆది. ౮. ౧౫౬.

పాడుచున్ : ఇంపెసఁగ — ఁతాళముగూడ మెట్టుచున్. ఆది. ౮. ౧౭౫.

పాఁతు :

పాఁతికొని : కొందఱెవ్వరికి నీకతమ తమ యిండ్లఁ —. ఆది. ౭. ౫౩౩, ఆది. ౭. ౧౩౩.

పాయు :

పాయక : — పాకశాసనికి భారత ఘోర రణంబునందు నారాయ ణునట్లు వాసిగ ధరామర వంశ విభూషణుండు నారాయణ భట్టు. ఆది. ౧. ౨౫; నన్నుఁ - కుండు. ఆది. ౬. ౧౩౧.

పాయన్ : భాగినేయునిన్ — నేరమింజేసి కృపాచార్యుండును నాయొద్దన యుండుదురు. ఆది. ౬. ౧౩౧.

పాయని : ఆలును దాసియున్ సురుఁడు నన్నది — ధర్మముల్ మహిన్. ఆది. ౩. ౧౭౪.

పాయవు : ఇవి యేనున్ సతతంబు నాయెడఁ గరంబిష్టంబులై యుం డు —. ఆది. ౧. ౧౨.

పాయు : మాయాదాస్యము — నుపాయము. ఆది. ౨. ౫౩.

పాయుచున్ : దుర్యోధనుచేయు నుపాయంబు వలనన్ — పాండవులు. ఆది. ౩. ౧౫.

పాయుదున్ : కర్మ బంధముల గ్రక్కునఁ — పుణ్యగతికి నేఁగు పురుషునట్లు. ఆది. ౫. ౧౭౩.

పాయుదు :

పాయుదురు : దేవముని ముఖ్యులు —. ఆది. ౪. ౨౫౦.

పాయన్ : నీకతమున నా దాస్యము ప్రాకటముగఁ — ననిన పలు కెడలోనన్ చేకొని, ఊఁటడి, నిర్గత శోకస్థితినున్న దానఁచూచె ఖగేంద్రా ! ఆది. ౨. ౫౧.

పాయుము : దీనినేయనోపవు; — మని. ఆది. ౫. ౨౫౧.

పాసి : వ్రస్సి నీపద్మపుటంబు — చెదరుచు. ఆది. ౩. ౩౦.

పాసితిన్ :

పాసినన్ : మేమింతఁ — (పి) మాపుత్త్ర పౌత్ర వర్గంబును పాయు. ఆది. ౬. ౧౨౮.

పాసెన్: పార్థునకు మనోరుజయును — నంత. ఆది. ౫. ౨౪౪.

పాసెను: అస్మజ్జననీ దాస్యము —. ఆది. ౨. ౧౨౦.

**పాఱవైచు:**

పాఱవైచి: అయ్యురగ కళేబరంబుఁ —. ఆది. ౨. ౧౭౩.

పాఱవైవన్: దానిఁ —. అర. ౩. ౫౪.

**పాఱు:**

పాఱన్: మూఁడు యోజనముల — నెగిచె నొక్క మొగిఁ బ్రతి బలమున్. ఆది. ౭. ౧౦౮.

పాఱెఁడు: మార్కొన నోపక వలియన్ — డె యీ ముకుందుఁడు స. ౨. ౪౬.

పాఱినన్: కుండలంబులు గొని —. ఆది. ౧. ౧౦౨.

పాఱిరి: సాధ్యుల నాయాస సాధ్యులై —. ఆది. ౨. ౧౦౦.

పాఱుచున్: తత్సమీపంబున — ఘనపంక్తులయందు. ఆది. ౮. ౭౧. అమ్మృగాన్వేషణ భ్రమాకులిత చిత్తుఁడై తగిలి — ముందటన్. ఆది. ౨. ౧౬౭.

పాఱు: లలితాచ్ఛస్ఫటిక శిలాతలములపైఁ — విమల నిర్ఝరిణీజల పూరితములు. అర. ౩. ౨౯౩.

పాఱెడు: — రథ్యంబులన్. ని. ౫. ౫౩.

పాఱెన్:

పాఱిన: ఏటువడి — మృగంబు వెంటన్ తగిలి. ఆది. ౨. ౧౬౬. నిజపుర సమీపంబునఁ — శుక్తిమతియను మహానదిన్. ఆది. ౩. ౨౬.

పాలార్చు : ఇప్పిశితాశిఁ పట్టి — ర్పంగనేల ? ఆది. ౬. ౨౧౬.

పిలుచు :

పిలిచి : గౌరముఖుండను వానిన్ —. ఆది. ౨. ౧౮౦.

పిలిచెన్ : అనుఁజుఁ — రమ్మని వాతాపి ప్రియముతోన్. అర. ౨. ౩౨౩.

పిలిపించి : పురోచనుఁ —. ఆది. ౬. ౧౩౮.

పిలుచుచున్ : ఆరక్కసున్ —. ఆది. ౬. ౨౯౨.

పిలువంగఁబడక : — సభలకు బలిమిన్ చని. ఆది. ౬. ౩౬.

పిలువంగఁబడి :

పిలువంబడి : బలవద్ద్యూతార్థముగాఁ - మగుడనగునె? స. ౨.౧౭౨.

పిలువన్ : ఋత్విజులను — పంచి. ఆది. ౨, ౨౦౫.

పిల్చి : కద్రువ వానిఁ —. ఆది. ౨. ౪౩.

పిల్చిన : — యిద్దురాత్ము. స. ౨. ౨౪౯.

పిల్చుచున్ : సాల్వుఁ - వానిమీఁద. అర. ౧. ౧౬౪.

పిల్చెన్ : — సరోవరం బనిలజున్ రాజీవ రాజీవ సత్సముదాళి వ్రజ చక్ర వాకబక హంస క్రౌంచ నాదంబులన్. ఆది. ౬. ౧౭౩.

పిల్వన్ :

పుచ్చు :

పుచ్చక : ఆశార్థుల వృథ — నీయునది సర్వ భూత ప్రీతిన్. ఆది. ౩. ౨౦౪.

పుచ్చన్ : వీరిఁ — నగునె నాకు? ఆది. ౬. ౨౫౨.

పుచ్చి : వస్తువు లెల్లను ధృతరాష్ట్రునకిచ్చి —. ఆది. ౫. ౬౩.

పుచ్చికొనఁగన్ : కార్ముకంబులఁ —. ఆది. ౮. ౧౧౮.

